శ్రీ

అచ్యుతరామగ్రంథనిలయమున చతుర్థపుష్పము,

శ్రీరామారావు : సంపాదకుఁడు.

చిత్రాడ.

# శ్రీమోక్షమార్గదర్శిని.



శ్రీరాజా

చెలికాని చినజగన్నాథరాయనిం

బహద్దరువారు

చిత్రాడ.

1931.



శ్రీరాజా

చెలికాని చిన జగన్నాథరాయనిం బహద్దరువారు,

ఏ త్రా డ.

CITY PRESS, COCANADA.

శ్రీ గురుభ్యో నమః.

శ్రీ రామచంద్ర ప్రపత్తి బ్రహ్మణే నమః.

# పీ ఠి క.

ఈకవిగారిచే రచింపంబడిన „ శ్రీమోక్షమార్గదర్శిని ” అనుగ్రంథము కేవలభక్తిరసప్రధానమై యుండుటంజేసి చదువ ప్రారంభించిన దాది తుదవర కెన్నిమారులు పఠించినను తనివి దీరనంతభక్తిరస ముట్టిపడుచుండు ననుట అతిశయోక్తి కాదు.

అదిచదువునప్పుడు అనేకభక్తిరసగ్రంథముల నోపికతో పరిశీలించి యెత్తి వ్రాయుటకు జమీందారులై యుండియు శ్రీవారి కింతశ్రద్ధాభక్తి కలిగి తమరాజకీయములను జక్కజేసి కొనుచు, లోకమును తరింపఁజేయుటకై యెట్లో తెరపిజేసికొని యింతటి మహాత్కార్యమునకుఁ బూనుకొంటి రని సంతోషాశ్చర్యమగ్నమానసులుగానిమానవు లుండ రని నానమ్మకము.

అద ట్లుండనిండు:—

సచ్చిదానందస్వరూపుం డగు భగవంతుండు, సృష్టిస్థితి లయకారణభూతుం డగు పరమేశ్వరుండు, సర్వంబు తానయై, తాన సర్వం బైన విష్ణుండు; అవాఙ్మానసగోచరుం డయ్యు శ్రీవారివంటి పరమభక్తాగ్రేసరమానససరోవరతరంగడోలికల నూగులాడు రాజహంసయై, శ్రుతిస్మృతిపురాణేతిహాసములచే నుతిపాత్రుండై, నిజభక్తహృదయకమలాసీనుండై, యెప్పు

ఆశ్రితపక్షపాతి, ఆర్తజనరక్షకుఁడు, ఆశ్రీరామచంద్రమూర్తి శ్రీవారిని సాధకునిగాఁ జేసికొని, స్వస్వరూపమును తెలిసికొనుటయే గాక, లోకమునుగూడ తరింపఁజేయుచున్నాఁ డనుట కించిదజ్ఞులకుఁగూడ గ్రాహ్యమే.

సుగమమై, సువ్యక్తమై, సకలజనాచరణీయం బగునది భక్తిమార్గ మొక్కటియే. ఈకలియుగమునందు భక్తిమార్గము చేతనే శ్రీవారివంటి భక్తిపరులు శ్రీమన్నారాయణనామామృత పాన మొనర్చియేగదా ముక్తికాంతను బొందఁగలుగుచున్నారు.

జమీందారు లగు శ్రీ శ్రీ చెలికాని చినజగన్నాథ రావు బహదరువారే యీజగతిని నిక్కమైన శ్రీరామభక్తి పరు లని వారిచే స్వయముగా రచియింపఁబడిన “శ్రీరామ సహస్రనామావళి” యే చెప్పక చెప్పుచున్నయది.

ఇక్కాలంబున రామసహస్రనామావళి పయివారు పలువెరంగుల రచియించి యుండిరి గాని వీరిచే రచియింపఁబడిన యీనూతననామావళి యన్వర్థాభిధానమై, కేవల భక్తిరసపుంజ పువ్రజతునుకలై సార్థకాఖ్యల బరగుచుండె ననుటకు సంశయము లేదు.

మఱియు నీనామము లొకదాని కొకటి పిరుతివియక పామరులకుఁ గూడ నతిసులభముగా నర్థ మగునటుల భక్తిరస భూయిష్ఠ మగుచు, ప్రత్యక్షరసౌష్టవంబును, ప్రతిపదార్థగుంభ నయు గలిగి కాలానుగుణ్య మగునటుల, అకారాది క్షకారవ

ర్ణాంతమువరకు క్రమము దప్పకుండ సహస్రనామములను క్రమ కూర్చి వ్రాయుచున్న యీనామంబుల జేర్కొనునప్పుడు పం క్తిపారవశ్యంబున ఆశ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కరించి యీప్సితముల నీడేర్పకపోఁ డను కుతుక ముదయింపనిమానవు లుండరు.

జమీందారు లగుటచే బెక్కులౌకికకార్యభారవహు లయ్యు నిహసౌఖ్యములు మీసాలపై తేనియలుగా గ్రహించి తాము తరించుటయే గాక లోకమునుగూడ తరింపఁజేయుటయే ప్రధానముగా నెంచి మోక్షానందదాయిని యగు "శ్రీరామ నామసహస్రం" బను నుత్తమగ్రంథరాజంబును శ్రీవారిచే స్వయముగా రచియింపంబడి శ్రీరామనామసహస్రంబు లను మాలగా గ్రుచ్చి ఆశ్రీరామచంద్రమూర్తికి కంఠాభరణం బొనర్చు టెంతయో ప్రశంసనీయము, నుతిపాత్రము, ఆనంద దాయకము.

ఈగ్రంథరాజమును జదివి చూచి పీఠిక వ్రాయ సమ కట్టితిని. కాని ఈనామావళీసారస్యమును చవి చూడవలయునే గాని లిఖింప తరముగాకుండె. లోకసాధారణమగు చమత్కార రచనవచనముల తెరగున యిందలి భక్తిరసమును సూచించు వెర వెరుంగక యీనామంబుల బేర్కొనువారల హృదయకంజంబు లకే హృద్గోచరంబు కాగల దని చదువరుల కాభాగము విడిచి పుచ్చి యింతటితో విరమించితిని.

ఈగ్రంథకర్తగారిచే వెలువడు గ్రంథసారస్యమును బట్టి నిజముగా యీకాలంబున సర్వజనులకు సులభముగా మోక్షసామ్రాజ్య మొసంగఁ దలంచి ఆశ్రీరామచంద్రమూర్తియే యీ చినజగన్నాథస్వామిరూపముగా యీ జమీందారీ వంశంబునం దుద్భవించె నని చదువరు లూహింపకపోరు.

సీ. శ్రీరామభక్తుఁడై ♦ చిత్రాడపురమందు
సద్గ్రంథరచనకు ♦ సాగె నెవఁడు
ప్రజల బిడ్డలరీతి ♦ భావించి పెంచుచు
గర్వంబు లేకుండ ♦ గ్రాలె నెవఁడు
సిరిసంపదలు గల్గి ♦ విరివిగా నేప్రొద్దు
పండితాదరణతోఁ ♦ బరగు నెవఁడు
రాజ్యంబు గల్గియు ♦ రాజసత్యాగియై
త్యాగియై జరియించు ♦ భోగి యెవఁడు

తే. అట్టి చెలికాని చినజగ♦న్నాథరాయ
బహాదరు నిలను శ్రీరాముఁ ♦ డహరహంబు
నాయు రైశ్వర్యసుగుణంబు ♦ లమిత మొసఁగి
పరగఁ గాపాడుగావుతఁ ♦ బ్రజలకొరకు.

ఇట్లు,
అవసరాల శేషగిరిరావు.

# ఉపోద్ఘాతము.



ఆంధ్రమహాశయులారా !

ఈగ్రంథసంకలనకర్త లగు శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారిని నేను చిన్నతనమునుండి యెఱింగియున్నవాఁడ నగుటచే నీగ్రంథమున కుపోద్ఘాతము వ్రాసి యిమ్మని వారి పుత్రులగు శ్రీ లక్ష్మీవేంకటభూసురగంగాధరరామారావుగారు నన్ను కోరియున్నందున నేనెఱింగినంతమట్టుకు వ్రాయఁ బూనుకొంటిని. ఇందు వ్యత్యాసము లేమైన నున్నచో మన్నింప విబుధుల వేఁడుకొనెదను.

శ్రీ చెలికాని చినజగన్నాథరావుగారు చిన్నతనమునుండియు శ్రీరామభక్తులై భక్తిరసప్రధానములగు శ్రీరామకథలు, అష్టకములు, స్తోత్రములు మున్నగునవి పారాయణముచేయుటయం దభిరుచి గలిగి వర్తించుచుండిరి. భాస్కరరామాయణము పలువదిపర్యాయములు పారాయణముజేసి పట్టాభిషేకములొనరించిరి. మఱియు గోపీనాథరామాయణముగూడఁ గొన్నిసార్లు పారాయణముజేసి పట్టాభిషేకము గావించిరి.

ఇట్లు జరుగుచుండఁ గొంతకాలమునకు, ప్రస్తుతపుపిఠాపురముమహారాజావారి తల్లిగారున్ను గ్రంథకర్తగారికి పినతల్లిగారున్ను అగు శ్రీరాజా మంగయ్యమ్మారావు బహద్దరురాణీవారికి శరీరములో అస్వస్థత కలిగినందున గ్రంథకర్తగారు మున్ను

గువారలు కొందరు పిఠాపురముకోటలో మకాము చేసియుం డుట తటస్థించినది.

పిమ్మట శ్రీరాణీగారికి ఎన్నిచికిత్సలు జేయించినను కొంచెమైన స్వస్థత గలుగక తుదకు స్వర్గమున నున్న తమభర్త గారగు శ్రీగంగాధరరామరాయప్రభుసన్నిధానమున కేగినారు.

తదనంతరము ప్రస్తుతమహారాజావారి మేనమామగా రగు శ్రీరాజా వెల్లంకి వెంకట్రామారాయనింగారిని గార్డియ నుగా గవర్నమెంటువారు నియమించిరి. అటుపిమ్మట శ్రీపిఠా పురము యెస్టేటువారికిని దత్తుడుగారికిని దావాలు జరుగుటయుఁ గొన్ని కారణములవలన రాజమహేంద్రవరపుకోర్టునందు శ్రీపిఠా పురము మైనరురాజావారి కోటమి కల్గుటచే శ్రీపిఠాపురము మైనరురాజావారు గ్రంథకర్తగారి నివాసగ్రామమగు చిత్రాడకు వచ్చి మకాము జేసియుండుటయుఁ దటస్థించినది.

అంత భాగవతోత్తములును, పరమధార్మికులును అగు శ్రీరాజా వెల్లంకి వేంకట్రామారాయినింగారు (గార్డియనుగా రు) మైనరురాజావారికి తిరుగ స్వరాజ్యసంప్రాప్తికొఱకు బఠిం పఁ గొన్ని మంత్రరాజము లుపదేశించి గ్రంథకర్తగారి నాతరు ణములో శ్రీమైనరురాజావారికిఁ దన్మంత్రపునశ్చరణాదులయం దెంతయు జాసటగనుండుట కేర్పఱచుటచే వారప్పటినుండియు శ్రీమైనరురాజావారితోఁ గలసి నిత్యము భగవత్పూజాదు లొనరింప మొదలుపెట్టిరి.

ఇట్లు జరుగుచుండఁ గొంతకాలమునకు భగవదనుగ్రహము గలుగుటచే, చెన్నపట్టణపు అప్పీలు కోర్టునందు శ్రీమైనరు రాజావారికి విజయము సంప్రాప్తించినందున శ్రీవారు వెంటనే పిఠాపురముకోటలోఁ బ్రవేశించి రాజ్యమంతయుఁ దిరిగి స్వాధీనపఱచుకొనిరి. అప్పుడు గ్రంథకర్తగారుకూడ శ్రీమైనరు రాజావారితోఁ గలసి పిఠాపురముకోటయందే నివసించియుండి శ్రీమైనరురాజావారి కన్నివిషయములయం దత్యంతసహాయులుగ నుండిరి.

ఇట్లు కొన్నివత్సరములు గడచినపిమ్మట శ్రీమైనరు రాజావారు విద్యాభ్యాసాదులకై చెన్నపట్టణము న్యూయింగ్టన్నకును, గ్రంథకర్తగారు చిత్రాడకును, వెళ్ళుటతటస్థించినది. గ్రంథకర్తగారు నిత్యపారాయణము జేయుచునేయుండిరి. అటుపిమ్మట గ్రంథకర్తగారిజనకులును, జనకమహారాజతుల్యులును అగు శ్రీరాజా చెలికాని వేంకట్రాయనింగారు తమవంశగురువులగు శ్రీమాన్ తిరుమల కాండూరి రంగాచార్యులుంగారిచే గ్రంథకర్తగారికిని వారి కుటుంబమునకును చక్రాంకితములు జేయించిరి.

ఇచ్చట శ్రీరాజా చెలికాని వేంకటరాయప్రభుప్రశంస వచ్చుటవలన నాపుణ్యమూర్తిని గురించి కొన్నివాక్యములు వ్రాయ నెంచితిని.

వీరు నిరంతరశ్రీమన్నారాయణచరణారవిందమరందపాన మదవదిందిందిరాయమానమానసులును మర్యాదానుగుణచర్యానవార్యులును, భగవద్ధ్యాననిష్ఠాగరిష్ఠులును, పరోపకారపరాయణులును, భూతదయాసమేతులును, పుణ్యచారిత్రులును. వీరి భూతదయ మహోద్భుతమైనది. పుడమిపై జన్మమెత్తి వీరెన్నడును జీవహింసజేసియెఱుఁగరుసరియేకదా తమ తలలోనిపేలకుసైతము మెట్టిబాధ కల్గునో యని ఒక్కప్పుడైనను తల దువ్వుకొనవొల్లక చేతికిదొరకినపేలనెల్ల బట్టుకొని బైట పారవేయుచుండెడివారు. తాము పరుండుమంచమునకు వేలు లక్షలు నల్లులుండి తమ శరీరరక్తమును విశేషముగఁ ద్రావుచున్నను సహించి, వానిమార్గమున నవియే పోఁగలవని తలంచుటయేగాని, ఒక్కనల్లినైనఁ జరాకుననైనఁ జంపుట కిష్టపడువారుకారు.

మఱియు నీమహామహునకు సంగీతసాహిత్యాదివిద్యలయందసమానప్రజ్ఞ యున్నదని పూర్వము దేవులపల్లి సుబ్బారాయశాస్త్రిగారు మున్నగు మహాకవులు చెప్పిన యీక్రిందిపద్యములవలన స్పష్టమగుచున్నది.

సీ. తనసముద్దామప్రతాపభాస్కరులకు
వైరిసైన్యములు నీహారములుగ
తనలసత్కీర్తిసుధాసాగరమునకు
దారకంబులు బుద్బుదములు గాఁగ

తనబానఘనఘనా♦ఘనపాళి కఖిలమా
ర్గణగణంబులు చాత♦కములు గాఁగ
తనవినిర్మలమనో♦వనజాతమునకు శ్రీ
పంకజోదరుఁడు ష♦ట్పదము గాఁగ
గీ. దనరుచుండెను ఘనతమై ♦ తనుజు లనుజు
లలరి గొలువంగఁ బద్మనా♦యకకులప్రి
ధాన చెలికాని రామరా♦ట్తనయ ధర్మ
రాయనృపసుత వేంకట♦రాయమౌళి.

సీ. ఒకవంక సకలంక♦మకరాంకసుందరుల్
సోదరుల్ సాదర♦స్ఫురణ జూప
నొకయోర సలమార♦సుకుమారసుకుమార
వారము ల్గడు గౌర♦వంబు నెరప
నొకదండ నురుచండి♦మకరండభుజదండు
లగు బందుగులు సంద♦డిగ వసింప
నొకకేల సతిపాన♦సకథావసానవి
ధానులౌ సుకవిస♦త్తములు నిలువ
గీ. నెలువ ననురంగ నిజసభా♦నిలయసీమ
సరససంగీతసాహిత్య♦వరకవిత్వ
నాటకాలంకృతి మహాపు రా♦ణప్రశంస
[illegible]

సీ. అసమానసాహితీ♦లసమానమధురక
విత్వకవిత్వసం♦వేది యనుచు
ఆసేతుశీతశై♦లాంతరాళక్షేత్ర
వాహినీసేవాప్ర♦భావుఁ డనుచు
వివిధభాషాజ్ఞాన♦విస్ఫురస్సాధన
సంగీతభంగీప్ర♦భాగుఁ డనుచు
హాయశాస్త్రమణిపరీ♦క్షితసత్కళాభిజ్ఞ
నీతిప్రబోధన♦నిపుణుఁ డనుచు

గీ. ననవరతరామనామజ♦పాఢ్యుఁ డనుచు
భక్తినమ్రానుజసుపుత్ర♦పాళి యనుచు
విబుధులు నుతింప సత్కీర్తి ♦ వెలసె దీవు
రమ్యగుణసాంద్ర వేంకట♦రాయచంద్ర.

సీ. బ్రహ్మకపాలాది♦పరమపుణ్యక్షేత్ర
సేవాసమాలబ్ధ♦సిద్ధమూర్తి
భక్తియోగవిశేష♦పరిలబ్ధవిజ్ఞాన
సంపూర్ణ రాజర్షి♦చక్రవర్తి
హృద్యానవద్యస♦ద్వైద్యక్రియాధూత
సకలదేశాయాత♦జనరుగార్తి
అర్థికదంబసం♦ప్రార్థితాభీష్టార్థ
సఫలీకరణవిరా♦జత్సుకీర్తి

గీ. చెలఁగు హరిపాదపద్మమో◆జితమనోళి
వితరణప్రణీతాశ్రిత◆విబుధపాళి
మహిత చెలికానివంశప◆ద్మనవహేళి
ధన్యవేంకటరాయరా◆జన్యమౌళి.

పాఠకమహాశయులారా! ఈసత్యఋషిని సంస్మరించి మన మెంతయుఁ గృతార్థులమైతిమి. ఇఁకఁ బ్రస్తుతాంశము నకు వత్తము.

వీరి యనుజ్ఞపై ని గ్రంథకర్తగారు చక్రాంకితు లయి ఆచార్యులయొద్ద మంత్రోపదేశమును బొంది నాఁటినుండియు విశేషించి తారకనామామృతము, ముముక్షుజనకల్పకము, భగవద్గీత మొదలగు గ్రంథములును మఱియుఁ గొన్ని ప్రబంధములు శతకాదులును నిత్యముఁ బఠింప మొదలుపెట్టిరి. తక్కిన గ్రంథములమాట యటుండ భగవద్గీత యనునది నిత్యపారాయణమున శ్రీమోక్ష మిచ్చునది గాకపోయినను, గురు పెట్టివాఁడో అది యట్టిద కావున నేతద్గ్రంథాభిప్రాయము ననుసరించి గ్రంథకర్తగారు పఠించినగ్రంథములలోని కొన్ని పద్యములు, అనగా నా కోర్కెలీడేర్పుమనియు, శ్రీమోక్ష మీయు మనియు వ్రాయఁబడిన పద్యములు మాత్రము వీరికోఱకు కొకచోట వ్రాసికొని యవి నిత్యము పారాయణము సేయుచుండిరి. ఇట్లుండ గ్రంథకర్తగారి పుత్రులగు శ్రీ లక్ష్మీవేంకటభూసురగంగాధరరాజు

రాన్నగా రాపద్యము లెల్ల నచ్చొత్తించినచో సర్వజనులును పఠియించి తరింపఁ గలుగుదు రని యుద్దేశించి తమకోర్కె సవినయముగఁ దండిగ్రారి కెఱిఁగించి ఆయాపద్యము లన్నియును నడిగి పుచ్చుకొని నాచేత నవియెల్ల సాపు వ్రాయించి ముద్రింపించిరి. ఈగ్రంథము కోర్కె లీడేర్పఁ గలుగునది కావున "శ్రీమోక్షమార్గదర్శిని" అని అష్టాక్షరీమంత్రతుల్యముగ నెని మిదక్షరములనామ ముంచఁబడినది.

శ్రీ యన, నిహమందు సిరి సంపదలను, మోక్ష మన, పరమందు మోక్షమును, దర్శిని యన, చూపించునది గావున నీయష్టాక్షరిమంత్రనామమున శ్రీమోక్షమార్గదర్శిని యనునామము ముంచఁబడినది.

ఈమంత్రగ్రంథ మత్యంతభక్తిశ్రద్ధలతో నిత్య మెవ్వరు పారాయణ మొనరింతురో వారు తప్పక శ్రీమోక్షమును బొందఁగల రని నాముఖ్యాభిప్రాయము.

ఇట్టి సద్గ్రంథము సమకూర్చి సర్వజనోపకార మొనరించిన శ్రీ రాజా చెలికాని చినజగన్నాథరావుగారిని, వారికుటుంబమును సీతారామచంద్రమూర్తి శ్రీమోక్ష మిచ్చి సంరక్షించుఁగాక !

ప్రజోత్పత్తి విజయదశమి.
చిత్రాడ.

ఇట్లు
రామభక్తుఁడు.

శ్రీరామా!

# పండితాభిప్రాయములు.

మహారాజశ్రీ శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావు గారు పంపించిన "శ్రీమోక్షమార్గదర్శిని" అను గ్రంథము లోని పెక్కుభాగములు చూచి యానందించితిమి. శ్రీరామభక్తులగు శ్రీచినజగన్నాథరావుగారు శ్రీరామచంద్రపాదారవిందాయత్త మగుచిత్తముతో సుప్రసిద్ధశతకములు మున్నగు గ్రంథములనుండి భక్తిరసప్రధానములగు పద్యము లెత్తి కూర్చి ప్రకటించి శ్రీరామభక్తుల కత్యంతోపకారకులైరి. అందులకు సకలకల్యాణగుణసముద్రుఁడగు శ్రీరామచంద్రమూర్తి సర్వశ్రేయము లొసంగుచు వారిని సదా రక్షించుచుండుఁగాక!

కూచి నరసింహము.

పి. చిదంబరశాస్త్రి.

శ్రీ. లక్ష్మీపతిశాస్త్రి.

శ్రీ. పాపయ్యశాస్త్రి.

---

శ్రీయై నమః.

మహారాజరాజశ్రీ శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారు భక్తచింతామణిశతకము, దాశరథీశతకము మొదలగు

45 శతకములనుండి తమగ్రంథసందర్భోచితములగు పద్యములను వెతకి సమకూర్చిన " శ్రీమోక్షమార్గదర్శిని " అను గ్రంథము ను జూచితిని. ఈగ్రంథము అన్వర్థనామక మనుటయేగాక అన్వర్థకమే యని సర్వులును ఒప్పుకొన తగినదియె. వీరిభక్తివిశేష ము వీరి గ్రంథరచనాప్రయత్నమే సర్వజనులకును బోధించగల దని నాయభిప్రాయము గాన యిట్టి మహాభక్తవర్యు లగు మహారాజశ్రీ శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారిని వారి వంశపరంపరను అంతర్యామి యగు శ్రీరమారమణుడు సకలా భీష్టములను యిచ్చి ఆచంద్రార్కము రక్షించుగాక !

పీఠికాపురసంస్థానపండితః
వేమతోపనామక సూర్యనారాయణశాస్త్రీ.

---

శ్రీరామా !

ఈ " శ్రీమోక్షమార్గదర్శిని " భక్తులకు మోక్షమార్గ ముం వర్ణించునదియే. ఇందు రెండుభాగములు గలవు. ఒకటి బహుభక్తిరసశతకభాగము. రెండవది వివిధకవిరచితపద్యభాగ మును. ఇట్లు సంకలితము చేయుటకంటెం గ్రొత్తగ పద్యముల విరచించుటయే కడుంగడు సులభ మని తోచుచున్నది. శతక ములన్నిటను శ్రావ్యములు మనోహరము లగుపద్యము లుండవు. వాని నన్నిటిం జదివి మేలేర్చి కూర్చుటయే యుండలి శ్రమ. తమకుం దృష్టిగాం నున్నంతలో నంవటునుం దృష్టి కలుగదు. ఆ నె

ఫుణిం బట్టియే యీగ్రంథము పండితస్తవ్య మగుటకును సర్వ భక్తజనోపకృతి యొనర్చుటకును గారణ మగుచున్నది. నలువది యైదు శతకములు నలువదియైదు ప్రబంధాదులు చదివి భక్త లోకోపకృతికై శ్రీ చినజగన్నాథరావుగారు పడిన శ్రమ శ్రమ గాక మోక్షమార్గదర్శినియై యానందకారణమే యగుచున్న దనవచ్చును. ఇందు మొదట శ్రీరామమానసపూజయుఁ జివర శ్రీరామనామసహస్రమును గూర్చుటచే నన్నివిధముల నిది ముముక్షువులకు సహాకారి యగుచున్నది. ఇందలి శతకముల లోను కావ్యములలోను సాధారణు లెఱుఁగనివియుఁ గలవు. చదువరుల కది యొక్క విశేషము.

కొత్తపల్లి సూర్యరావు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

---

శ్రీరస్తు.

శ్లో. రాజ్ఞా శ్రీచెలికానివంశ్యజగతీనాథేన ధీశాలినా
పద్యాన్యంబునిధేశ్చ సత్కృతితతేరత్నాని. సంగృహ్ణతా
భూషాసంకలితా శుభాకృతిరియం మోక్షాధ్వసందర్శినీ
సంఘత్తే భజతాం శ్రియాతనుభృతా మిత్యాదరంకుర్మహే.

ఇత్యేవం పీఠికాపురసంస్థానపండితేన గుదిమెళ్ల తిరుమల వేంకటరంగాచార్యేణ సామోదం వితీర్ణమిదం ప్రశస్తిపత్రం.

శ్రీ.

మహారాజశ్రీ రాజా చెలికాని చినజగన్నాథరావుగారు బహుప్రయాసతో గ్రంథముల పరిశోధించి సమకూర్చిన "శ్రీ మోక్షమార్గదర్శిని" యను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగ జూచితిని. ఈగ్రంథము భక్తుల కత్యంతోపయుక్తంబుగ సమకూర్చిన శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారి దైన భక్తిని వేనోళ్లఁ జెప్పకఁ జెప్పుచున్నది.

ఇట్టి గ్రంథరాజంబును ప్రచురించి ఆంధ్రులకు భక్తిమార్గసూచకు లగు శ్రీచినజగన్నాథరావుగారికి పరమేశ్వరుఁడు సకలాభీష్టైశ్వర్యముల నిచ్చి ఆచంద్రార్కముగ రక్షించుఁగాత!

శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి.

---

మహారాజశ్రీ శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారిచే కూర్పబడిన శ్రీమోక్షమార్గదర్శినిని కొంతవరకు చూచితిని. వారిబుద్ధి వైశద్యమునకు వారిచే చేయబడిన పద్యముల విమర్శనకు చాలా సంతసించితిని. ఈగ్రంథము మోక్షమార్గదర్శనమే. అనుమానము లేదు.

వడలి లక్ష్మీనారాయణశాస్త్రి
పిఠాపురసంస్థానపండితులు.
ఆమ్నాయార్థవాచస్పతి.

శ్రీరామా!

మహారాజశ్రీ శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావు గారు పంపించిన 'శ్రీమోక్షమార్గదర్శిని' అను గ్రంథమును స్థాలీపులాకన్యాయముగా జూచితిని. అందు వీరు పెక్కుశతకములనుండి భక్తిరసప్రధానములగు పద్యముల గూర్చి ప్రకటింపించి తమకుగల రామభక్తిని వెలువరించి లోకుల కత్యంతోపకార మొనర్చిరి. కాన శ్రీచినజగన్నాథరావుగారికి శ్రీరాముఁడు శ్రేయోదాయియై యిట్టిలోకోపకృతికి యత్నించుచుండున ట్లనుగ్రహించుగాక!

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

తే. ఉర్వి చెలికానివంశమం దుదయమంది
చినజగన్నాథరాయాఖ్యచేఁ బ్రసిద్ధ
కీర్తి వహియించి భక్తిసంకీర్తనములఁ
జేర్చి శ్రీమోక్షమార్గదర్శిని రచించె.

తే. ఇట్టి పుణ్యపురుషకోటి మెట్టుచుండు
నట్టి చిత్రాడపురిగాక యవని యంత

కడుపవిత్రిత గాదె యేకాలమందు
భక్తి యెల్ల దోషములను బాపు గాదె.

పిఠాపురము
20-3-31.

ఇట్లు
ఉమర్ అలీషా.

---

'శ్రీమోక్షమార్గదర్శిని' అను నీపొత్తము ముముక్షుజనోపయుక్తమై భక్తపారాయణభాజనమై మోక్షప్రసాదసోపానమువోలె నున్నయది.

ఈమహనీయగ్రంథము శ్రీ శ్రీ శ్రీ రాజా యెర్నగూడెము గారిపట్నము ప్రొప్రయిటర్లు పద్మనాయకులు రాజబంధువులు నగు శ్రీ చెలికాని చినజగన్నాథరాయణింగారు ప్రకటించి లోకమున వెల్లడించి కలకాలసద్యశంబును బడసినందులకు సంస్తవనీయులు.

మఱియు నిట్టి గ్రంథములు ప్రకటింప నుద్యుక్తుల గావించి వీరికుటుంబములకు ననిర్వచనీయముగ నాయురారోగ్యసుశ్రీప్రభృతిఫలంబుల నందజేయ భగవంతుని ప్రార్థించెద.

పిఠాపురము
8-4-31.

ఇట్లు
ద్వివేది నారాయణశాస్త్రి
పండితుఁడు
ఆంధ్రపరిశోధకమహామండలి.

శ్రీరాజా చెలికాని చినజగన్నాథరావుగారు ప్రకటిం చిన “ శ్రీమోక్షమార్గదర్శిని ” యను గ్రంథమును జూచి మిక్కిలి సంతసించితిని. “ స్వయం తీర్ణః పరాంస్తారయతి ” అనునట్లు అనేకపురాణాదిగ్రంథములనుండియు శతకాదులనుం డియు భక్తిరసములగు పద్యములను గ్రహించి “ ఏకో స్వాదు న భుంజీత ” అనునట్లు తాము చదివి యానందించుటయే గాక యితరులకుం గూడ నిట్టి భక్తిని వెల్లడించుటకు నాయాపద్య ములు స్వీకరించి యిట్టి “ మోక్షమార్గదర్శిని ” యను గ్రంథ రూపముగా బ్రకటించియుండిరి. రత్నములవంటి యిందలిపద్య ములు పఠించి, వల్లించుకొనువా రెల్లరకు భక్తి రక్తి ముక్తి యనునట్లు సర్వమును కరతలామలకంబు గాగలదు. ఇది ప్రస్తు తము పాఠశాలలలో చదువుకొను బాలురకు పఠనీయగ్రంథము గా నేర్పడిన మిక్కిలి భగవద్భక్తి యలవడి ప్రాచీనపద్ధతిగా సకలగ్రంథపఠనసద్వృత్తి గలిగి మరింత దేశభాషాభివృద్ధి కాగ లదు. ఇం దుదాహృతములగు పద్యములు భగవద్భక్తికి ప్రా ముఖ్యము లగుటచేత ఆబాలవృద్ధులకు పఠనయోగ్యములై యాజన్మాంతమువరకు స్మరించుకొని తరించుట కర్హంబులై “ నన్ను రక్షింపుము దేవా ” అనునట్లు భగవత్ప్రపత్తిని వెల్ల డించుచుండుటచే నిది ప్రతిమానవునకు పఠనయోగ్యమై యు న్నది. పురాణాదిగ్రంథములు చదువుట మిక్కిలి ప్రయాస యనుకొనువారుసహితము అందలిసారవంత మైనవిది పఠించి యే

తత్ఫలితమును బొందఁగలరు. ఇటువంటి పుణ్యభక్తి విశేషములు గల గ్రంథము లింకను పెరు సమకూర్చి ప్రకటించునట్లు భగవంతుఁడు వీరి నాయురారోగ్యాదు లొసంగి రక్షించుగాక !

కొత్తపల్లి.
ది 14-3-1931.

సత్యవోలు రాధామాధవరావు,
సంగీత, సాహిత్యవిద్వాన్.
పిఠాపురము, గోదావరిజిల్లా.

---

మహారాజశ్రీ రాజా శ్రీ చెలికాని చినజగన్నాథరావు బహద్దరువారిచే బెక్కుభక్తిప్రధానశతకములనుండి యేర్చి కూర్చఁబడినమోక్షమార్గదర్శిని యనుగ్రంథమును స్థాలీపులాకన్యాయముగఁ జదివి యత్యానందము నొందితిని. ఇందన్నియు భక్తిరసప్లుతములుగానే యుండి చిన్నలు పెద్దలుకూడ కంఠస్థముగా నుంచుకొనఁ దగిన వని తలఁచితిని. ఇట్టి సద్గ్రంథరచయిత లగు శ్రీ చినజగన్నాథరావు బహద్దుడువారు లోకమునకు బహూపకృతి నొనరించిరి.

పంచాంగ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

మహారాజశ్రీ శ్రీ రాజా చెలికాని చినజగన్నాథరావు గారు అత్యంతభక్తితో శ్రీరామచంద్రపాదారవిందభక్తు లగు పూర్వకవులచే భక్తిరసప్రధానముగ విరచింపబడిన గ్రంథరాజములనుండి పద్యరత్నముల నెత్తి కూర్చిన “ శ్రీమోక్షమార్గదర్శిని ” అను గ్రంథమును జదివి మిక్కిలి యానందించినాను. శ్రీరామభక్తుల కిది చదివినను వినినను మేనం బులకాంకురము గలుగకమానదు. శ్రీ చినజగన్నాథరావుగారు తాము శ్రీరామభక్తిరసము ననుభవించి చదువరులం గూడ బాల్గొన జేయుచున్నా రనుట యత్యుక్తి కాదు. “ స్వయంతీర్ణః పరాంస్తారయతి ” యను నారామభక్తి వారియెడల రూఢియైనది. శ్రీరామచంద్రమూర్తి వీరిని వీరికుటుంబమును సకలశుభంబులొసంగి రక్షించుగాక !

చీమలకొండ అద్వైతబ్రహ్మశాస్త్రి,
ఆంధ్రోపాధ్యాయుఁడు,
ఆర్.సి.హెచ్. హైస్కూలు, పిఠాపురము.

---

మహారాజశ్రీ శ్రీ రాజా చెలికాని చినజగన్నాథరావు గారిచే సమకూర్పఁబడిన “శ్రీమోక్షమార్గదర్శిని” యను గ్రంథములోని భాగములు నచ్చటచ్చటఁ జూచి సంతసించితిని.

శ్రీమద్భగవత్పాదారవిందభక్తులగు శ్రీ చినజగన్నాథరావుగారు శ్రీమత్పరమేశ్వరచరణారవిందాయత్తమగు చిత్తముతో భక్తి రసపూరితములగు శతకములు మొదలగువానినుండి రసవంతము లైనపద్యములను సమకూర్చి యచ్చొత్తించి భక్తుల కత్యం తోపకార మొనర్చిరి. సర్వకళ్యాణగుణఖని యగు సర్వేశ్వ రుఁడు సదా వారి కభీష్టముల నొసంగుచు రక్షించుఁగాక !

ఇట్లు

ఉపాధ్యాయుల వేంకటేశ్వరశాస్త్రి.

ఆంధ్రోపాధ్యాయుఁడు

ఆర్. సి. హెచ్. హైస్కూలు,

పిఠాపురము.

---

మహారాజశ్రీ శ్రీ రాజా చెలికాని చినజగన్నాథరావు గారు భక్తిరసప్రధానముగా రచించిన "శ్రీమోక్షమార్గదర్శిని" అనుగ్రంథమునుదయతోనాకొసంగగా శ్రద్ధతోనామూలాగ్రము చదివిచూచి అమితానంద మొందితిని. ఈగ్రంథమును జదువు నప్పుడు ఆయాఘట్టములయందు నాకు కలిగినయుత్సాహమును లిఖితపూర్వకముగా నిందు బొందుపర్చలేనందుకు చింతించుచు

న్నాఁడను. పెక్కుశతకములను పురాణములను శ్రద్ధాభక్తుల తో పరిశీలించి అందందలి భక్తిరసపూరితములగు పద్యముల నేరి మాలగా గూర్చినట్లు గ్రంథముఖమున బ్రకటించుటచే పండితపామరుల కతిసులభముగా మోక్షమొసంగ వీరిగ్రంథము మార్గదర్శి యనుట కిసుమంతయు సందియములేదు. సాధారణ సంసారి తనకుటుంబము నుద్ధరించుకొనుటకు రాత్రింబవళ్లు తీరిక లేక కొట్టుకొనుచుండ జమీందారు లయ్యేను తమజమీందారీ వ్యాపారముల కభ్యంతరము రాకుండ తెరపి జేసికొని పరసాధ నోపాయమగు నీసద్గ్రంథరచనకు బూనుకొని తాము తరించుట యేగాక తమజీవితము తదితరులను తరింపజేయుటయందుకూడ వినియోగించి యుండుటచే వీరిభక్తి నెంతయు కొనియాడవలసి యున్నది. మహారాజులకైనను జమీందారులకైనను సాధార ణసంసారులకైనను తెరపిజేసికొందమన్న భగవచ్చింతనకంతయు తెరపియే. ఈషణత్రయమున మునిగి కొట్టుకొనుచున్న నట్లే సరిపడుచుండును. శ్రీ శ్రీ చెలికాని చినజగన్నాథరావుగారి వంటివారికి తప్ప భగవచ్చింతనాసక్తులమయి మోక్షమార్గదర్శ కుల మగుదమను కుతూహల మున్నను మహారాజులకైన మరి యెవరికైన నలవడునా ? పూర్వపుణ్యవిశేష ముండవలయును గాని; ఇక్కాలంబున శ్రీవారివంటివా రచ్చటచ్చట కొందరుం డుటచే యింకను పురాణములనియు శతకము లనియు సద్గ్రం థరచన లనియు పరిశీలనము లనియు పండితాదరణము లనియు

జరుగుచున్నవిగాని లేకున్న సున్నయే! వేయేల? [illegible] ఆచంద్రార్కము పుణ్యగ్రంథరచనాసక్తముగను ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగను పుత్రపౌత్రాభివృద్ధిగను నుండునట్లు శ్రీరామచంద్రమూర్తి యీకుటుంబమువారిని సదా రక్షించుచుండుగాత!

సర్వవరము.
21-6-1931.

ఇట్లు
అవసరాల శేషగిరిరావు.

---

-

## ఈ పుస్తకమందలి శతకములు.

౧ శ్రీరామతారకశతకము
౨ ప్రసన్నరాఘవశతకము
౩ శ్రీరామచంద్రప్రభుశతకము
౪ శ్రీరఘునాయకశతకము
౫ దాశరథీశతకము
౬ సీతాపతిశతకము
౭ జానకీపతిశతకము
౮ శ్రీరామశతకము
౯ కోదండరామశతకము
౧౦ భద్రాద్రిరామశతకము
౧౧ సచ్చిదానందశతకము
౧౨ జగదీశశతకము
౧౩ కృష్ణశతకము
౧౪ దీనచింతామణిశతకము
౧౫ దేవకీనందనశతకము
౧౬ నారాయణశతకము
౧౭ జగన్మోహనశతకము
౧౮ నరసింహశతకము
౧౯ వరాహనరసింహశతకము
౨౦ వేణుగోపాలశతకము
౨౧ రాజగోపాలశతకము
౨౨ శ్రీఅనంతపద్మనాభశతకము
౨౩ సిద్ధిజనార్దనశతకము

# ఈ మాహృతపద్యగ్రంథములు



౧ శ్రీకూర్మపురాణము
౨ విష్ణుపురాణము
౩ ఆంధ్రలింగపురాణము
౪ ఆంధ్రబ్రహ్మాండపురాణము
౫ నృసింహపురాణము
౬ నారసింహపురాణము
౭ భాగవతము
౮ శేషధర్మము
౯ హరివంశము
౧౦ ఉత్తరహరివంశము
౧౧ శ్రీమదాంధ్రమహాభారతము
౧౨ అధ్యాత్మరామాయణము
౧౩ మొల్లరామాయణము
౧౪ శ్రీవేంకటేశ్వరమాహాత్మ్యము
౧౫ శ్రీవేంకటాచలమాహాత్మ్యము
౧౬ సర్పపురమాహాత్మ్యము
౧౭ శ్రీభద్రాచలమాహాత్మ్యము
౧౮ రామకర్ణామృతము
౧౯ కృష్ణకర్ణామృతము
౨౦ కౌసల్యాపరిణయము
౨౧ మహేంద్రవిజయము
౨౨ ఆత్మనివేదనము

౨౩ తెనాలి రామకృష్ణకవి చరిత్రము
౨౪ రామదాసు చరిత్రము
౨౫ మనుచరిత్రము
౨౬ నీలాపరిణయము
౨౭ జ్ఞానవేదసారసంగ్రహము
౨౮ శ్రీవరవరమునిప్రవణవిజయము
౨౯ లంకావిజయము
౩౦ కురుక్షేత్రసంగ్రామము
౩౧ సుభద్రాపరిణయము
౩౨ మోహినీరుక్మాంగదము
౩౩ సంగీతమాలతీమధుకరము
౩౪ గరుడాచలనాటకము
౩౫ కాళవి
౩౬ వాల్మీకిచరిత్రము
౩౭ కుచేలోపాఖ్యానము
౩౮ నారాయణాచలమాహాత్మ్యము
౩౯ శ్రీరంగమాహాత్మ్యము
౪౦ బ్రహ్మోత్తరఖండము
౪౧ గౌరాంగచరిత్రము
౪౨ యక్షరామదాసుచరిత్రము
౪౩ విజయవిక్రమ
౪౪ జైమినిభారతము
౪౫ ధ్రువోపాఖ్యానము

శ్రీరామచంద్ర.



# శ్రీరామమానసపూజ.



## సంకల్పము.

క. శ్రీధరణిజామనోహర !
సాధుగుణా ! షోడశోప • చారంబుల నా
రాధింతు నిన్ను మది నా
కాధారమ వగుచుఁ బ్రీతి • నందుము రామా.

## ధ్యానము.

క. స్నానమున నఘశతంబులఁ
బోనడచు వియన్నదీప్ర•భూతస్థానం
బైన తవపాదపద్మ
ధ్యానం బొనరింతు హృత్స•ఖంబున రామా. ౨

## ఆవాహనము.

క. ఆవాహన మిదె సీతా
దేవీమణిఁ గూడి రాగ•దే దయతోడన్
సేవించెద వివిధము లగు
సేవలచే భక్తనికర•సేవిత రామా. • 3

## షోడశోపచారములు.

క. నవరత్నస్థగితము హే
మవిరచితము విమలమృదుల•మానితము రవి
చ్ఛవి గల సింహాసన మిదె
యవనిజతోఁ గూరుచుండు•మయ్యా! రామా. ౪

క. హరువిల్లు విఱిచి, జానకి
కరమును గ్రహియించి మహాక్తి•కంబుల సీతా
శిరమునఁ దలఁబ్రా లోసిన
కరయుగమున కర్ఘ్య మిడుమఁ • గైకొను రామా. ౫

క. జనకుఁడును గుహుఁడుఁ బ్రక్షా
ళన మొనరుపఁ జూఁచు మోక్ష♦లక్ష్మీస్థానం
బని మునులు పొగడు నీపద
వనజములకుఁ బాద్య మొసఁగు♦వాఁడను రామా. ౬

క. వెడఁదకనులఁ జిఱునగవున
నుడుపతికళలన్ వెలుంగు♦చుండెడిముఖముం
దిడియెద నాచమనీయం
బడఁకువతో; నందుకొనఁగ♦దయ్యా రామా. ౭

క. భానుకులదీప ! సరయూ
స్నానం బొనరించి సకల♦జనులకు మోక్ష
స్థానం బొసఁగిన నీ కిదె
స్నానము పంచామృతముల ♦ సలిపెద రామా. ౮

క. నట్టడవుల వల్కలములు
గట్టి నిడెన్ సవతితల్లి ♦ కాని సభక్తిం
బట్టుదుకూలము లొసఁగెద
నట్టిట్టనకన్ ధరింపు♦మయ్యా రామా. ౯

క. అజ్ఞుండను నాయం దొక
ప్రజ్ఞయు లేదించుకంత ♦ భక్తిని నీకీ
యజ్ఞోపవీత మొసఁగెద
విజ్ఞాన మొసంగి కావ♦వే నను రామా. ౧౦

క. క్రొందలిరుమేనఁ బూసెద
వందితచరితా సుగంధ•బంధురమౌ శ్రీ
చందనము సొంద మలరఁగ
సుందరఘనదేహా కరుణఁ•జూడుము రామా. ౧౧

క. తులసీదళములచేతం
జలజంబులచేత వివిధ•జాతుల పుష్పాం
జలు లెత్తి పూజఁ జేసెదఁ
బొలుపార సహస్రనామ•ములచే రామా. ౧౨

క. ఆపద్బాంధవ ! సేవక
తాపత్రయహారణ ! ముక్తి•దాయక ! విశ్వ•
పాలక ! నీ కొనరించెద
ధూపార్చనఁ గొనుము దాస•తోషక ! రామా. ౧౩

క. తాపసహృద్గృహముల ను
ద్దీపించుచునుండు జ్ఞాన•దీపమ ! నీకుఁ
దీపారాధనఁ జేసెదఁ
బాపవె యజ్ఞానతిమిర•పటలము రామా. ౧౪

క. కదళీఖర్జూరజంబూ
బదరీద్రాక్షాదిమధుర•ఫలములు శబరీ
రదనముల గంట్లు లే వని
వదలకు నైవేద్య మొసఁగు•వాఁడను రామా. ౧౫

క. పోకలును లేఁతతమ్ముల
పాకులును సుగంధచూర్ణ ♦ మమరిచినాఁడన్
జేకొను మిదె తాంబూలము
నాకాధిపవినుత లోక ♦ నాయక! రామా. ౧౬

క. క్రూరాత్ములఁ గూలిచి భూ
భారము వారించి పట్ట ♦ భద్రుఁడ వగు సీ
తారామచంద్ర! కర్పూర
నీరాజన మిడెద నీకు ♦ నియతిని రామా. ౧౭

క. పలుకులకుఁ దలఁపులకు ముని
తిలకులకుం దెలియరాని ♦ తేజమ వనుచున్
దొలిపలుకు లాదువాక్యం
బుల నీకర్పింతు మంత్ర ♦ పుష్పము రామా. ౧౮

క. పొంగుచును బ్రదక్షిణసా
ష్టాంగనమస్కారములు స ♦ మర్పించెద ని
స్సంగ! భవభంగ! ముక్తి నొ
సంగవె నీదాసదాస ♦ జనుఁడను రామా. ౧౯

శ్రీరామార్పణమ్.

## శ్రీరామషోడశాంగపూజ.

రఘుపుంగవాయనమః - పాదౌపూజయామి

రాజీవలోచనాయనమః - గుల్ఫౌపూజయామి

రాఘవాయనమః - జానునీపూజయామి

వాచస్పతయేనమః - ఊరూపూజయామి

విశ్వరూపాయనమః - జంఘేపూజయామి

పక్షిరాడ్వాహనాయనమః - కటింపూజయామి

విశ్వమూర్తయేనమః - మేఢ్రింపూజయామి

వటపత్రశాయినేనమః - నాభింపూజయామి

పరమాత్మనేనమః - హృదయంపూజయామి

శ్రీకంఠాయనమః - కంఠంపూజయామి

సర్వాస్త్రధారిణేనమః - బాహూంపూజయామి

రఘూద్వహాయనమః - ముఖంపూజయామి

పద్మనాభాయనమః - జిహ్వాంపూజయామి

ఆపదుద్ధారకాయనమః - దంతాన్పూజయామి

పరంజ్యోతిషేనమః - లలాటంపూజయామి

జ్ఞానగమ్యాయనమః - శిరంపూజయామి

సర్వాత్మనేనమః - సర్వాంగానిపూజయామి.

## శ్రీరామ అష్టోత్తరశతనామములు.

ఓం రామాయనమః
ఓం రామభద్రాయనమః
ఓం రామచంద్రాయనమః
ఓం దశరథతనయరామాయనమః
ఓం కౌసల్యాసుతరామాయనమః
ఓం భరతాగ్రజరామాయనమః
ఓం సుమిత్రాపుత్రసేవితరామాయనమః
ఓం శత్రుఘ్నపూజితరామాయనమః
ఓం విశ్వామిత్రప్రియరామాయనమః
ఓం తాటకాంతకరామాయనమః
ఓం సుబాహుప్రాణనాశకరామాయనమః
ఓం అహల్యాశాపవిమోచకరామాయనమః
ఓం విభగ్నహరచాపరామాయనమః
ఓం సీతావల్లభరామాయనమః
ఓం జామదగ్నిదర్పదళనరామాయనమః
ఓం పితృవాక్యపరిపాలనరామాయనమః
ఓం జటావల్కలధారిరామాయనమః
ఓం చిత్రకూటనివసనరామాయనమః
ఓం కాకాసురేకటాక్షరామాయనమః

ఓం దండకారణ్యవాస రామాయనమః

ఓం శబరీసేవ్యపాద రామాయనమః

ఓం విరాధవధ రామాయనమః

ఓం సమ్మోహిత మునీంద్ర రామాయనమః

ఓం ఖరదూషణహరణ రామాయనమః

ఓం మాయామారీచహంతక రామాయనమః

ఓం కబంధనిధన రామాయనమః

ఓం హనుమత్సేవిత రామాయనమః

ఓం సుగ్రీవమిత్ర రామాయనమః

ఓం సప్తతాళవిభేది రామాయనమః

ఓం వాలివినాశక రామాయనమః

ఓం విభీషణాభయప్రదాయక రామాయనమః

ఓం జలధిబంధన రామాయనమః

ఓం కుంభకర్ణమారణ రామాయనమః

ఓం రావణాంతక రామాయనమః

ఓం శంకరస్తుతిపాత్ర రామాయనమః

ఓం మృతవానరజీవనప్రద రామాయనమః

ఓం పుష్పకారూఢ రామాయనమః

ఓం అయోధ్యాపురవాస రామాయనమః

ఓం కృతపట్టాభిషేక రామాయనమః

ఓం కుశలవజనక రామాయనమః

ఓం బ్రాహ్మణపుత్రదాయక రామాయనమః

ఓం జితేంద్రియాయ రామాయనమః

ఓం జితక్రోధాయ రామాయనమః

ఓం జితామిత్రాయ రామాయనమః

ఓం సర్వదేవాదిదేవాయ రామాయనమః

ఓం సర్వదేవస్తుత్యాయ రామాయనమః

ఓం ఆదిపూరుషాయ రామాయనమః

ఓం జగద్గురవే రామాయనమః

ఓం పవిత్రపాదరేణవే రామాయనమః

ఓం శోషితాఖిలపాపాయ రామాయనమః

ఓం తారకబ్రహ్మమూర్తి రామాయనమః

ఓం చంద్రార్కనేత్ర రామాయనమః

ఓం శైలాత్మజాజప్యనామమంత్రాయ రామాయనమః

ఓం కల్మషఘ్నాయ రామాయనమః

ఓం నామనిర్ధూతపాపాయ రామాయనమః

ఓం విరాట్స్వరూప రామాయనమః

ఓం నిష్పక్షపాత రామాయనమః

ఓం నిష్కామాయ రామాయనమః

ఓం నిర్వికల్పక రామాయనమః

ఓం సర్వలోకనిధాన రామాయనమః

ఓం నిరుపాశ్రయ రామాయనమః

ఓం లోకప్రియంకర రామాయనమః
ఓం నీలమేఘశ్యామ రామాయనమః
ఓం భక్తవత్సల రామాయనమః
ఓం వైకుంఠ వాస రామాయనమః
ఓం భవభయహారణ రామాయనమః
ఓం పాపనాశాయ రామాయనమః
ఓం దీనరక్షాయ రామాయనమః
ఓం దీనదయాకరాయ రామాయనమః
ఓం తారక నామాయ రామాయనమః
ఓం కోట్యర్క తేజసేయ రామాయనమః
ఓం సర్వమంగళాయ రామాయనమః
ఓం మాయామానుషరూప రామాయనమః
ఓం అనంతాయ రామాయనమః
ఓం నిర్గుణాయ రామాయనమః
ఓం నిర్వికారాయ రామాయనమః
ఓం నిరంజనాయ రామాయనమః
ఓం నిరామయాయ రామాయనమః
ఓం నిరంతరాయ రామాయనమః
ఓం వాఙ్మనసాతీతాయ రామాయనమః
ఓం అఖిలప్రపంచాత్మాయ రామాయనమః
ఓం భానజసకాయ రామాయనమః

ఓం స్వయంభూతాయ రామాయనమః
ఓం దుష్కర్మవినాశాయ రామాయనమః
ఓం పరమేశాయ రామాయనమః
ఓం జగన్మోహనాయ రామాయనమః
ఓం వాల్మీకిసన్నుతాయ రామాయనమః
ఓం పాపలతాలవిత్రాయ రామాయనమః
ఓం అనాథనాథాయ రామాయనమః
ఓం వాత్సల్యజలధి రామాయనమః
ఓం నిరుపమానాయ రామాయనమః
ఓం భక్తచింతామణి రామాయనమః
ఓం శరణాగతరక్షణ రామాయనమః
ఓం భుక్తిముక్తిప్రదాయ రామాయనమః
ఓం పరాత్పరాయ రామాయనమః
ఓం జగత్కుటుంబి రామాయనమః
ఓం శంఖచక్రకిరీటధారి రామాయనమః
ఓం ద్వాదశోర్ధ్వపుండ్రధారి రామాయనమః
ఓం ఆత్మారామాయనమః
ఓం దుస్స్వప్ననాశన రామాయనమః
ఓం శోకనాశన రామాయనమః
ఓం చతుర్విధపురుషార్థప్రదాయక రామాయనమః
ఓం అఖిలలోకవ్యాపక రామాయనమః

ఓం జరామరణవర్జితరామాయనమః
ఓం రాజరాజేశ్వరరామాయనమః
ఓం సర్వమంత్రాత్మకరామాయనమః
ఓం స్మరణముక్తిదాయకరామాయనమః
ఓం శ్రీరామరామరామాయనమః.





శ్రీరామచంద్రః

# శ్రీమోక్షమార్గదర్శిని.



సీ. శ్రీరామ నాదగు ♦ జిహ్వపై మీరు నా
మాక్షరబీజంబు♦లమర వ్రాసి
వాని నాపలుకుల ♦ వసియింపఁగాఁ జేసి
శత్రుసంహారంబు ♦ సలుపఁబూని
యుక్తియు బుద్ధియు ♦ నూహ దాసున కిచ్చి
భక్తితో మీపాద♦భజనయందు
నాసక్తి బుట్టించి ♦ యమృతసారం బెల్లఁ
దారకశతకంబు ♦ ద్వారితముగను

గీ. బలుకుపలికించు వేవేగఁ ♦ బరమపురుష
యింపుగఁ బఠించువారికి ♦ నిహముఁ బరము
దాతవై యిచ్చి రక్షింపు ♦ ధన్యచరిత
రామతారకదశరథ♦రాజతనయ.

సీ. శ్రీరామ నీవు నా♦చిత్తమందే నిల్చి
రక్షింపవయ్యాన♦న్నక్షయముగ
నన్ను రక్షింపను ♦ నాథు లెవ్వరు లేరు
నాస్వామి నీవని ♦ నమ్మినాను
తల్లివైనను నీవె♦తండ్రివైనను నీవె
వేదాంతవేద్య ని♦న్వేఁడినాను
ఆయోధ్యవాసా య♦నంతస్వరూపక
యీవేళ నీవు న♦న్నేలుకొనుము

గీ. వేగ రక్షింపుమని నిన్ను ♦ వేఁడినాను
నమ్మఁగాఁజాల నెవ్వరి ♦ నెమ్మితోడ
నీకుఁ బ్రియుఁడను మ్రొక్కితి ♦ నీరజాక్ష
రామతారకదశరథ♦రాజతనయ.

సీ. రామరామాయని ♦ రంజిల్ల నావంతు
నిజముగా రక్షింప ♦ నీది వంతు
అపరాధినని పల్కి ♦ యాఁసింప నావంతు
నిజముగా రక్షింప ♦ నీది వంతు
నీపాదపద్మంబు ♦ నెఱనమ్మ నావంతు
నిజముగా రక్షింప ♦ నీది వంతు
ఒరుల సేవింపక ♦ యోర్చుట నావంతు
నిజముగా రక్షింప ♦ నీది వంతు

గీ. నేను పంతంబు దప్పక ♦ నిన్నుఁ గొలుతు
నీవు పంతంబు దప్పక ♦ నిర్వహించు
పంత మిది నీకు నాకును ♦ బరమపురుష
రామతారకదశరథ♦రాజతనయ. ౩

(రామతారకశతకము)

ఉ. దాసజనానుపోష ఫల
దాయక నాయక రావె కావవే
యీసమయాన నీకరుణ
యించుకఁ జూపవె జాగు సేయకే
దాసులదాసదాసుఁడను
ధన్యునిగా నను వేగఁ జేయవే
మాసరివారిలోన నను
మన్ననఁ జేయు ప్రసన్నరాఘవా. ౪

ఉ. కోరిననరించిన స్మృతియుఁ
గ్రిందికిఁ ద్రోయక నన్నుఁ గావవే
యేడుగ డీవెగాక యిఁక
నెవ్వరు దిక్కుగదయ్య నీవు నా
జోడును బాయ కెప్పటికి
చోద్యముగా చల మింతఁ జేసెగా
పోఁడిమిఁ జేర్చి బంధువులఁ
బూని కెడీస్చు ప్రసన్నరాఘవా. ౫

ఉ. కింకరు లెల్లఁ గూడి యొక
కీడు దలంపఁగ వేచియున్నయా
సంకెల లూడఁదీసి నను
చయ్యన మొక్కల నీడ్చి తెచ్చి యా
పంకజనాభ నీకృపకుఁ
బాత్రుఁడఁగాఁ గరుణించి యేలితా
వేంకటశైలనాథ నను
వేడ్కను బ్రోవు ప్రసన్నరాఘవా.
(ప్రసన్నరాఘవశతకము)

శా. నీవున్ జీవులు భిన్ను లట్లగుట నే
నీయంశ మయ్యున్ ద్వదు
జ్జీవన్మాయమహానుభావమున కు
త్సేవుండ వీవున్ భవ
త్సేవానిష్ఠుఁడ నేను నన్నమతి దో
చెం గానఁ ద్వద్దాస్యకృ
ద్భావం బూని భజింతుఁ బ్రోవు మనుకం
పన్ రామచంద్రప్రభూ.

మ. భవదీయాంఘ్రిసరోజరేణుకణసం
స్పర్శంబునన్ రాయి మా
నివధూటిత్వము నొందెఁ బూరుషుఁడనా
నేనాపరాగంబు సో

క విశేషంబుగ దైవతోత్తమ భవ
త్కైవల్యముం గాంతు నా
వ్యవసాయం బొనరించి ప్రోవ.గదవ
య్యా రామచంద్రప్రభూ. ౮

మ. మమకారాదికబంధుబంధురతనే
మాత్రంబునుం దేలతే
క మహాగాధమహాబ్ధిలో మునిఁగి దుః
ఖం బొందుచున్నాఁడ శీ
ఘ్రము తద్బంధము లూడ్చి ఘోరభవపా
రావారతీరంబుఁ జే
ర్చి ముదం బొందఁగఁ జేసి ప్రోవఁ దగదే
శ్రీరామచంద్రప్రభూ. ౯

(రామచంద్రప్రభుశతకము.)

చ. దురితము లన్నియుం దొలఁగఁ
ద్రోసి ననుం గరుణింతువంచు నే
నరసి నినున్ మదిం దలఁచి
యంజలిఁ జేసి నుతించి వేఁడఁగా
నరమర సేయ నీకుఁ దగ
దయ్యా వహింపఁగదయ్యా వేగ నన్
సరగునఁ బ్రోవుమయ్య రఘు
నాయక భక్తవరప్రదాయకా. ౧౦

ఉ. రోయక పాపకూపములఁ
　　　　ద్రోయక పాపముచిత్రగుప్తులన్
వ్రాయకయుండ నన్ను నెడ
　　　　బాయక యుండుము పుత్రవర్గముం
జాయకయుంటఁ దండ్రులకు
　　　　లాయక, వేయుఁక సేలఁ బంతె మే
నాయకలంకఁ బ్రోవు రఘు
　　　　నాయక భక్తవరప్రదాయకా ౧౧

ఉ. తియ్యనివిల్తు గెల్వ నెను
　　　　దీయనిసోయగ మాశ్రితాళికిన్
గయ్యములోన నయ్యరుల
　　　　కై యమరూపముఁ జూపు జాణ వీ
వయ్య ననుం గృపాబ్ధిఁ గన
　　　　వయ్య నమస్కృతు లందవయ్య నన్
నయ్యనఁ బ్రోవుమయ్య రఘు
　　　　నాయక భక్తవరప్రదాయకా ౧౨

(శ్రీరఘునాయకశతకము.)

చ. హలకులిశాంకుశధ్వజశ
　　　　రాసనశంఖరథాంగకల్పకో
జ్వలజలజాతరేఖలను
　　　　సాంకములై కనుపట్టుచున్న మీ

కలితపదాంబుజద్వయము
గౌతమపత్నికొసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావఁగదె
దాశరథీ కరుణాపయోనిధీ. ౧౩

చ. జనవర మీకథాళి విన
సైపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుపు
నీచునకున్ వర మిచ్చినావు ని
న్ననయము నమ్మి కొల్చిన మ
హాత్ముల కేమి యొసంగెదో సనం
దనసుత మాకొసంగుమయా
దాశరథీ కరుణాపయోనిధీ. ౧౪

ఉ. దాసినచుట్టమా శబరి
దాని దయామతి నేలినావు నీ
దాసుని దాసుఁడా గుహుఁడు
తావకదాస్య మొసంగినావు నేఁ
జేసినపాపమా వినుతిఁ
జేసినఁ గావవు కావుమయ్య నీ
దాసులలోన నేనొకఁడ
దాశరథీ కరుణాపయోనిధీ. ౧౫

(దాశరథిశతకము.)

మ. ధర నేఁ జేసిన ఘోరపాపముల నం
తంబొందఁగాఁ జేయ దే
వర నీకన్నను వేఱు లేరొకరు గీ
ర్వాణాళిలో నన్న నా
ధరణిన్ దండధరోగ్రకింకరులచే
తం జిక్కఁగానీక నీ
చరణాబ్జంబులచెంతఁ జేర్పుము నమ
స్కారంబు సీతాపతీ! ౧౬

శా. చెంతన్ జేరినఁ గూర్మి లేక యిటు గా
సిం బెట్టుటల్ సూడఁ సా
మంతం బేమనవచ్చు నిన్నిఁక మహా
త్మా లోకులా వారిపై
బంతం బేమిటికయ్య పిచ్చుకపయిన్
బ్రహ్మాస్త్ర మన్నట్లు నా
వంతల్ దీర్చు మొఱాలకించుమిఁక దే
వా వేగ సీతాపతీ. ౧౭

(సీతాపతిశతకము.)

ఉ. తాపము మాన్పి పాపముల
దగ్ధము జేసి కృపారసంబు వే
నాపయిఁ గుప్పి గుప్పి తమ
నామము నాహృదయంబులోపలన్

ప్రాపుగ నిల్పి యాపదలఁ
బాపవె నీచరణంబు లెప్పుడున్
ప్రాపని నమ్మియుంటి నను
బాయక యుండవె జానకీపతీ. ౧౮

ఉ. ఎవ్వరి వేఁడుకొందు నిఁక
నెవ్వరు నన్ గరుణించువారు వే
రెవ్వరు యెంచిచూచినను
యీమహిలోపల నన్నుఁగావఁగా
మువ్వురిలోన నీవయని
మోదముతో శరణంబు వేఁడితిన్
నెవ్వగమాన్పి యేలు నను
నీరజలోచన జానకీపతీ. ౧౯

ఉ. నిన్నని చాల నమ్మితిని
నేఁటికి నాదురవస్థ వాయదో
పన్నగతల్ప యోజనక
భావమునం దయజూచి యాపదల్
అన్నియుఁ బాఱఁదోలి సుఖ
మందఁగఁ జేయవె రామచంద్ర నీ
కన్నకుమారునింబలెను
గావవె శీఘ్రము జానకీపతీ. ౨౧

(జానకీపతిశతకము.)

క. ఖలుఁడను, పాపాత్ముఁడను, వి
కలుఁడను, దుర్మతిని, జడుఁడఁ ♦ గలితుండను, చం
చలుఁడను, నధముఁడఁ జెనటి, న
బలుఁడను, మూఢుఁడను, నను గృ♦పం గను రామా. ౨౧

క. ధన మది దుస్తరభవబం
ధన మది బహు సుగుణగణవి♦ధనమది శుష్కేం
ధన మది తృష్ణాగ్నికి సా
ధన మది గావునను మోక్ష♦ధన మిడు రామా. ౨౨

(రామశతకము.)

క. రక్షోవంశవిభంజన
పక్షికులాధ్యక్షగమన ♦ పన్నగశయనా
రక్షింపుము నను ద్విజగ
ద్రక్షా కోదండరామ ♦ దనుజవిరామా. ౨౩

(కోదండరామశతకము.)

క. రామా యెల్లప్పుడు నీ
రామతో నావెంటనంటి ♦ రమ్మా విలస
త్ప్రేమను మోక్షం బిమ్మా
శ్రీమద్భద్రాద్రిధామ ♦ శ్రీరఘురామా. ౨౪

క. రామా నను విడనాడకు
రామా నను గన్నతండ్రి ♦ రఘుకులముఖ్యా

రామా నను రక్షింపుము
శ్రీమద్భద్రాద్రిధామ ♦ శ్రీరఘురామా. ౨౫

క. రామా నీదయచేతను
రామా నీపాదభక్తి ♦ రంజిల్లుచుండన్
రామా ననుఁ బోషింపుము
శ్రీమద్భద్రాద్రిధామ ♦ శ్రీరఘురామా. ౨౬

(భద్రాద్రిరామశతకము.)

గీ. బద్ధు లేలయ్య ననుఁగన్న ♦ ముద్దులయ్య
రద్దు సేయక వడి నిందు ♦ రాగదయ్య
కలుషజాలంబులను ద్రుంచి ♦ కావవయ్య
నవసుగుణధామ సచ్చిదా♦నందరామ. ౨౭

(సచ్చిదానందశతకము.)

క. తావకపదపద్మంబులు
భావమున న్నిలుపఁ దగిన ♦ ప్రజ్ఞ నొసఁగి నన్
గావుము వేగమె నుతస
త్సేవకజనకల్పభూజ ♦ శ్రీజగదీశా. ౨౮

క. కుతుకముతోడుత నిను నా
మతిలోఁ దలఁచుటయె గాని ♦ మఱి యే మెఱుఁగన్
సతతముఁ గావుము నను నా
శ్రితపక్ష పంకజాక్ష ♦ శ్రీజగదీశా. ౨౯

(జగదీశశతకము.)

కం. హరి నీవు దిక్కు నాకును
సిరితో నేతెంచి మకరి ♦ శిక్షించి దయం
బరమేష్ఠి సురలుఁ బొగడఁగఁ
గరిఁ గాఁచినరీతి నన్ను ♦ గావుము కృష్ణా. ౩౦

కం. మందుఁడఁ గడు దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి ♦ నీచుఁడ నన్నున్
సందేహింపకఁ గావుము
నందునివరపుత్ర నిన్ను ♦ నమ్మితిఁ గృష్ణా. ౩౧
(కృష్ణశతకము.)

శా. హారంబుల్ మణికుండలాంబరసువ
ర్ణాగారముల్ గాఁగ నా
నేరంబుల్ సమకూర్చి కానుకలుగా
నే నిచ్చెదన్ వాని శృం
గారంబుల్ గద యంచుఁ దాల్చి నను చే
కొన్ బ్రోవు నారాయణా
సారంబుల్ భవదీయధామములు కృ
ష్ణా ! దీనచింతామణీ, ౩౨
(దీనచింతామణిశతకము.)

మ. అనిరుద్ధాచ్యుత యీశ కేశవ ముకుం
దా ధోక్ష జోపేంద్ర వా

మన దామోదర చక్రిపాణి హరి రా
మా శౌరి శార్ఙ్గి జనా
ర్దన పీతాంబర భక్తవత్సల నమో
దైత్యారి వైకుంఠ వా
స నృసింహాంబుజనాభ ప్రోవు ననుఁగృ
ష్ణా దేవకీనందనా. ౩౩

శా. ప్రారబ్ధానుభవంబు దీరకపవ
ర్గప్రాప్తి లేదండ్రు గా
ధీర శ్రేష్ఠు లనంతకోటు లిఁకనై
తే వారికర్మంబులున్
ప్రారబ్ధంబులు గావె ముందటికి నో
భావజ్ఞ సైరించి నా
ప్రారబ్ధంబులఁ దీర్పవే కరుణఁ గృ
ష్ణా దేవకీనందనా. ౩౪

శా. దీనుల్ గల్గిన నీదు రక్షణగుణా
ధిక్యంబు రాణించు నా
దీనుం డెవ్వఁడు లేఁడు నీదు కరుణా
దృష్టిన్ గృతార్థుల్ జుమీ
నే నే దీనుఁడ నన్నుఁ బ్రోవు శరణం
టిన్ ద్వన్మహాదీక్షను

జ్ఞానశ్రీకరమూర్తి నమ్మితిని కృ
ష్ణా దేవకీనందనా. ౩౫

మ. అరయం జందనగంధిపై విదురుపై
నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపై
నందవ్రజస్త్రీలపై
బరగంగల్గుభవత్కృపారసము నా
పైఁ గొంత రానిమ్ము మీ
చరణాబ్జంబులె నమ్మినాఁడ హరి కృ
ష్ణా దేవకీనందనా. ౩౬

(దేవకీనందనశతకము.)

మ. వెలయన్ యౌవనకాలమందు మరుఁడున్
వృద్ధాప్యవేళంబులన్
బలురోగంబులు నంత్యమందు యముఁడున్
బాధింపఁ బట్టైన యీ
పలుజన్మంబులు చాల దూలితి నను
బాలింపవే దేవ మీ
ఫలితానందదయావలోకనము నా
పైఁ జూపి నారాయణా. ౩౭

మ. అపరాధంబులు నిన్నుఁ నమ్మి వినుమే
నాజన్మపర్యంతముల్
విపరీతంబుగఁ జేసినాఁడ నిఁక నీ
వే దిక్కు నాలోనికిన్
గపటంబింతయు లేక దండధరుకుం
గట్టీక రక్షించుమీ
కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురిల
క్ష్మీనాథనారాయణా. ౩౮
(నారాయణశతకము)

శా. అన్నింటంగలయన్నిశక్తులకు నీ
వాధారమై యుంట ని
న్నున్నాకెన్నఁగుకోర్కెఁ గోరవలయుం
దోస్తుల్ ధనద్రవ్యముల్
నిన్నుం గోరిన లాభ మున్నదియె తం
డ్రీ శాశ్వతంబైన కో
ర్కెను నా కిచ్చి కృతార్థుఁ జేయఁగదె కృ
ష్ణా శ్రీజగన్మోహనా. ౩౯
(జగన్మోహనశతకము)

సీ. సర్వేశ నీపాద ♦ సరసిజద్వయమందు
జిత్త ముంచఁగ లేను ♦ చెదరకుండ

నీ పైన దయ యుంచి ♦ నిలిచియుండెడునట్లు
జేసి నన్నిపు డేలు ♦ సేవకుండను
వనజలోచన నేను ♦ వట్టి మూర్ఖుండఁ జుమ్మి
నీస్వరూపముఁ జూడ♦నేర్పు వేగ
తనకుమారున కుగ్గు♦తల్లి పోసినయట్లు
భక్తిమార్గంబను ♦ పాలఁ బోసి

గీ. ప్రేమతో నన్నుఁ బోషించి ♦ పెంచుకొనుము
ఘనత కెక్కించు నీదాస♦గణములోన
భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. ౪౧

సీ. అమరేంద్రవినుత ని♦న్ననుసరించినవారు
ముక్తిఁ బొందిరి వేగ♦ముదముతోడ
నీపాదపద్మముల్ ♦ నెఱనమ్మి యున్నాను
నాకు మోక్షం బిమ్ము ♦ నళిననేత్ర
కాచిరక్షించు నన్♦గడతేర్చు వేగమె
నీసేవకుని జేయు ♦ నిశ్చయముగఁ
గాపాడినను నీకుఁ ♦ గైంకర్యపరుఁడనై
చెలఁగి నీపనులను ♦ జేయువాఁడ

గీ. ననుచుఁ బలుమాఱు వేఁడెద ♦ నబ్జనాభ
నాకుఁ బ్రత్యక్ష మగుము ని♦న్నమ్మినాను

భూషణవికాస శ్రీధర్మ♦పురనివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర. ౪౧

(నరసింహశతకము)

సీ. స్నానసంధ్యాద్యను♦ష్ఠానశక్తుఁడఁ గాను
పరమయోగాభ్యాస ♦ పరుఁడఁ గాను
విమలదివ్యక్షేత్ర♦గమనదక్షుఁడఁ గాను
ఘనవరదాన సం♦గతుఁడఁ గాను
భవదీయపదభక్త ♦ భక్తియుక్తుఁడఁ గాను
నిరుపమజ్ఞానమా♦నితుఁడఁ గాను
పరమోపకారసం♦భరితచిత్తుఁడఁ గాను
శమదమనిత్యని♦శ్చలుఁడఁ గాను
గీ. వినుము దీనావన యనాథ ♦ జనుఁడ నయ్య
నేను మిక్కిలి దెలియఁగా♦నేర నయ్య
దేవ నిర్హేతుకకృప నన్నుఁ ♦ బ్రోవవయ్య
వైరిహరరంహ! సింహాద్రి♦నారసింహ. ౪౨

(వరాహనరసింహశతకము.)

సీ. నిను సదా హృత్కంజ♦మునఁ బాయకుండ నా
ప్రహ్లాదువలెఁ జే♦ర్పరిని గాను
ఏవేళ నిను భజి♦యించుచుండుటకు నా
ధ్రువచిత్తుఁడైనట్టి ♦ ధ్రువుఁడఁ గాను

సతతంబు నిన్ను సం♦స్తుతిఁ జేయుచుండ నా
వేశిరంబులసర్ప♦విభుఁడఁ గాను
నీవిశ్వరూపంబు ♦ సేవించుటకు వేయి
చక్షువుల్ గల్గు వా♦సవుఁడఁ గాను
గీ. యిట్టి వారలఁ గృపఁ జూచు ♦ టెచ్చు గాదు
దేవ ! నావంటిదీనునిఁ ♦ బ్రోవ వలయు
మదరిపురిపాల ! మునిజన♦హృదయలోల
వేణుగోపాల భక్తసం♦త్రాణశీల. ౪౩

సీ. వేదంబులును నీవె ♦ వేదాంగములు నీవె
జలధులు నీవె భూ♦జములు నీవె
క్రతువులు నీవె స♦ద్వ్రతములు నీవె కో
విదుఁడటంచన నీవె ♦ నదులు నీవె
కనకాద్రినీవె యా♦కాశంబు నీవె ప
ద్మాప్తసోములు నీవె ♦ యగ్ని నీవె
యణురూపములు నీవె ♦ యద్వితీయుఁడ వీవె
బ్రహ్మంబు నీవె గో♦పతియు నీవె
గీ. యిట్టి నిను సన్నుతింప నే♦నెంతవాఁడఁ
గింకరుని జేసి ప్రోవు మ♦కించనుండ
మదరిపురిపాల మునిజన♦హృదయలోల
వేణుగోపాల భక్తసం♦త్రాణశీల. ౪౪

(వేణుగోపాలశతకము)

సీ. అల యజామిళుని ♦ కలుషంబు లెడలించి
    రోలమితో సాయుజ్య ♦ మియ్య లేదె
అపకార మొనరించి♦నట్టి కాకాసురుఁ
    గృపతోడఁ జూచి ర♦క్షింప లేదె
పగవానితమ్ముని ♦ మృగధరార్క-స్థాయి
    గా లంక బట్టముఁ ♦ గట్ట లేదె
సభలోన నపరాధ ♦ శతములు పలికిన
    శిశుపాలు నాత్మలోఁ ♦ జేర్ప లేదె
గీ. నీదయారస మొరులు వ♦ర్ణించఁ గలరె
నన్నుఁ గరుణింపు మిదె నీకు ♦ విన్నపములు
సురుచిరాకార! ఉన్నవ ♦ పురివిహార
రాజగోపాల రాధామ♦నోజఖేల. ౪౯

(రాజగోపాలశతకము.)

సీ. ఆదినారాయణ ♦ ఆత్మపరాయణ
    కేశ వాచ్యుత హరి ♦ వాసుదేవ
శ్యామలాంబుదవర్ణ ♦కామితార్థప్రద
    సామగానప్రియ ♦ సదయహృదయ
భక్తరత్నామణి ♦ పరమాత్మ పరమేశ
    దేవజగన్నాథ ♦ దేవదేవ
శర్వాణీసన్నుత ♦ గీర్వాణవందిత
    నీరజలోచన ♦ నిగమవినుత

గీ. లోకనాయక సద్భక్త ♦ లోకవరద
పుండరీకాక్ష నను( గృప( ♦ బ్రోవవయ్య
శ్రీరమానాథ మాధవ ♦ శ్రీయనంత
పద్మనాభ దయానిధే ♦ పరమపురుష. ౪౬

సీ. ఉదయాస్తమయముల ♦నుడుగక నే నాడు
మాటలే నీనామ♦మంత్రజపము
బాహుయుగ్మంబుల ♦ బహువిధంబుల( జేయు
పను లెల్ల మీ దివ్య♦పాదపూజ
యుడుగక( బుడమిపై ♦ నడిచినయడుగులు
తగ మీకు( జేయు ప్ర♦దక్షిణములు
శయ్యపై వేడ్కతో ♦ శయనించు టెల్లను
ధర సాగి సాష్టాంగ♦దండ మిడుట
గా( దలంపుము వే(డెద( ♦ గమలనాభ
అభయదానంబు మా కిమ్ము♦సుభగచరిత
శ్రీమనోనాథ మాధవ ♦ శ్రీయనంత
పద్మనాభ దయానిధే ♦ పరమపురుష. ౪౭

(అనంతపద్మనాభశతకము)

చ. సరసఖ దానవాంతక స
నందనసన్నుత యబ్జలోచనా
మురహర వల్లవీవితతి
మోహనరూప యనారతంబు మ

గ్గురుతరఘోరదోషములఁ
కూలఁగఁద్రోచి శుభంబు లిమ్ము స
స్థిరకృపతోడఁ గోటిఫలి
సిద్ధిజనార్దనపాపమర్దనా. ౪౮

ఉ. వావిరిఁ ద్వన్మహామహిమ
వర్ణన సేయుచు సారెసారెకున్
బ్రోవు మటంచుఁ గోరి కడుఁ
బ్రాల్పునఁ బూజ లొనర్చి భక్తియెం
తే వహియించియుండునను
నింపుగఁ బ్రోవుము నీకు నిచ్చలున్
సేవ యొనర్తుఁ గోటిఫలి
సిద్ధిజనార్దన పాపమర్దనా. ౪౯

ఉ. వారిజనేత్ర సంవరణ
వారధిమున్గుచుఁ దేలుచుండి ని
స్సారకళత్రదేహధన
సౌఖ్య మనిత్య మటంచు రోసి నా
భారము నీదుపై నిడితిఁ
బాలను ముంచెదో నీట ముంచెదో
చేరఁగఁదీయు కోటిఫలి
సిద్ధిజనార్దనపాపమర్దనా. ౫౦

(సిద్ధిజనార్దనశతకము)

శా. నానాయోనులఁ బుట్టి గిట్టి తుదకీ
నాజన్మముల్ సార్థకం
బౌ నీనామము సంస్మరింపఁ గలిగెన్
నాతండ్రి మన్నించి ముం
దైనన్ జన్మము లొందనీక నను ని
త్యానందునిం జేయుమో
దీనాధీన యటంచుఁ బీఠపురకుం
తీమాధవున్ గొల్చెదన్. ౯౧

శా. విశ్వాకారుఁడు విశ్వగర్భుఁడును వి
శ్వేశుండు విశ్వాత్ముఁడున్
విశ్వోద్ధారుఁడు విశ్వధారకుఁడు శ్రీ
విష్ణుండవౌ నిన్ను నే
విశ్వాసంబున విశ్వసించితి దయన్
వీక్షింపవే నిత్యభూ
తిస్వీకారునిఁ జేయవే యనుచుఁ గుం
తీమాధవుం గొల్చెదన్. ౯౨

(కుంతీమాధవశతకము)

ఉ. వన్నెలుగుల్కు మీచరణ
వారిజముల్ మది నెంతు నెప్పుడున్
జెన్నుగఁ బ్రోవవే వినుత
శీల లసత్కరుణాలవాల నా

విన్నపమున్ ధరింపు మర
        విందదళాక్ష మునీంద్రపక్ష యో
శ్రీన్నన వేల్పుతమ్ముఁడ ప్ర
        కాశకృపాకర వేంకటేశ్వరా. ౧౩

ఉ. విన్నపమాలకించు పది
        వేలవిధంబులఁ గీర్తిఁ గాంచు మేల్
చెన్ను దలిర్ప నన్ను దయ
        సేయు భవంబులు బాయునట్లు నీ
యున్నతపాదపద్మముల
        నుల్లముఁ జెందఁగఁ జేయు ప్రేమతో
పన్నగకంకణాక్రియ య
        పారకృపాకర వేంకటేశ్వరా. ౧౪

చ. పతితుఁడ నేను బల్ పతిత
        పావనమూర్తివి నీవు దీనసం
గతుఁడను నేను దీనజన
        కల్పకవృక్షము నీవు బ్రోవు న
న్నితరులు బ్రోవ లేరు జగ
        దీశ ! రమేశ ! సురేశమిత్ర వా
కృతినుతపాదపద్మనుతి
        పాత్ర కృపాకర వేంకటేశ్వరా. ౧౫

(వెంకటేశ్వరశతకము.)

సీ. సతతమదంఘ్రిసం◆చారంబు లన్నియు
నమర నీకు ప్రదక్షి◆ణములు గాఁగ
నిర్వర్తిమత్కరకృత ◆ నిఖిలకర్మంబులు
నవ్యతావకపూజ◆నములు గాఁగ
సంతతాత్మీయభా◆షణము లెల్లఁ ద్వదీయ
నామమంత్రోచ్చార◆ణములు గాఁగ
వితతంబులైన నా◆మ తలంపు లన్నియు
విమలయుష్మద్ధ్యాన◆విధులు గాఁగఁ

గీ. కైకొని కృతార్థుఁ జేసి రక్షింపవలయుఁ
గాని నేతత్క్రియలఁ జేయు ◆ మానసంబు
దశవిధేంద్రియములతోడ◆ వశము గాదు
జానకీరామ ! దేవతా ◆ సార్వభౌమ. ౫౬

సీ. సంచితం బయ్యె నా◆సంచితం బగు కర్మ
మంతయుఁ ద్వత్పరా◆యణత వలన
మామ కాగామిక◆ర్మంబు నిర్మూలమై
యణఁగె సద్యస్కృతత్వ ◆ దర్పణమున
చిత్త ముత్వత్పదా◆యత్తమై యుండుట
ప్రారబ్ధమైన న◆న్నంటకుండె
నాకింక జన్మంబు లేమంట తథ్యంబు
భవదీయసాయుజ్య◆పదము నొందఁ

గీ. గలిగె ధన్యుఁడ నైతి నీకరుణవలన
ననుచు దృఢనిశ్చయము గల్గి మనుచుండ
యోగ్యతనుఁ బాత్రుఁ జేసి నన్నేము మయ్య
జానకీరామ దేవతాసార్వభౌమ. ౫౭

(జానకీరామశతకము.)

Hyderabad-27
తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయము
క్రమసంఖ్య 14763
25.7.86

మ. అతికాతిన్యుఁడ నీవు నిక్కముగ న
త్యాపన్నుడ నేను నే
మతిలో నించుక జాలి బుట్ట దిఁక నే
జేదేవుఁజింతింతు నే
గతి యేతోవఁ జరింతు నన్య మెఱుఁగం
గాంక్షించి నీపాపుఁజూ
చ్చితి నీచిత్తము యెట్లు వచ్చినసరే
శ్రీభావనారాయణా. ౫౮

(శ్రీ భావనారాయణశతకము.)

శా. శ్రీకళ్యాణగుణాభిరామ విబుధ
శ్రేణీకిరీటద్యుతి
వ్యాకీర్ణాంఘ్రిసరోరుహద్వయసహ
స్రాక్షస్తుతా యచ్యుతా
నాకుం బ్రాపును దాపు నీవె యగుచున్
సన్నేలుమీ రామభ

ద్రా ! కారుణ్యసముద్ర ! ధీర ! రఘువీ
రా ! జానకీనాయకా. ౫౯

మ. చెడుగన్ గష్టుఁడ దుష్టచిత్తుఁడఁ బర
స్త్రీలోలుఁడన్ బాలుఁడన్
జడుఁడన్ మూఢుఁడ గొండెకాఁడను దురా
చారిన్ని షేధాత్ముఁడన్
గడుసన్ గాకరిఁ గల్లగుల్లఁ గపటిన్
గర్విన్ననుం గావు మీ
యడి యున్నాఁడను నీవె దిక్కు రఘువీ
రా ! జానకీనాయకా. ౬౦

మ. ఇనవంశోత్తమ వేదశాస్త్రములలో
నే వింటి నే వింటి వాఁ
డును నీకుం బ్రతిగాఁడు నీకుఁ గలబం
టు న్నన్ను రక్షింపు కా
లునిబంట్లన్ విదళింపఁగావలయు నా
లో నుండుమీ యుండుమీ
యనమోఘాస్త్రము విల్లుఁ బూని రఘువీ
రా ! జానకీనాయకా. ౬౧

(ఒంటిమిట్టరఘువీరశతకము.)

చ. పతితుఁడ బాపమానసుఁడ
భక్తివిహీనుఁడ బాపకర్ముఁడన్

మతిరహితుండ బాలిశుఁడ
మానవిదూరుఁడ మత్తచిత్తుఁడన్
వితతమతప్రదూషకుఁడ
విశ్రుతసజ్జనవంశకుండ దు
ష్కృతుఁడను నన్ను సత్కృపతొ
శీఘ్రము బ్రోవవె రామరాఘవా. ౬౨

ఉ. ఇష్టముతోడ మిమ్ము భజి
యింపఁగ నింత పరాకదేల నా
యిష్టముఁ దీర్చ మింపుమిక
శిష్టము గాదె భజించువారలే
కష్టముగా దలంప నిఁకఁ
గావఁగ నేరికి నిష్టకష్టముల్
నష్ట మొనర్చి ప్రోవు మిఁక
నన్ను ప్రసన్నత రామరాఘవా. ౬౩

చ. తనయుఁడవై దయారసతఁ
దారకమంత్రము నాకొసంగవే
యన విని దేవహూతికి స
మంచితమంత్రరహస్య మంతయున్
మనమున నిండఁ జెప్పి కమ
మానితమోక్ష మొసంగినట్లు నా

మనమునఁ గోర్కెఁ దీర్చి నను
మన్నన సేయవె రామరాఘవా. ౬౪
(శ్రీరామరాఘవశతకము)

మ. మును దారం గరుణించినావు శబరిన్
మోక్షంబుఁ జెందించి నా
వినజున్ రాజును జేసినావు ధరణిన్
బృందారకస్వామి పు
త్రుని జీవింపఁగఁ జేసినావు పదభ
క్తుం గుంభకర్ణానుజున్
మును లంకావిభుఁ జేసినావు దయ స
న్నుతిం బ్రోవు రామప్రభో. ౬౫

శా. నేరంబుల్ పరికించకయ్య వినుమా
నేనేమియుం బల్కనన్
భారంబున్ మది నుంచకయ్య యిఁక నీ
పాదంబె దిక్కయ్య నీ
వారిం జేర్పఁగదయ్య బంధములఁ ద్రో
వం జెందనీకయ్య నన్
గారుణ్యంబునఁ బ్రోవవయ్య నవమే
ఘశ్యామ రామప్రభో. ౬౬

శా. కాంతానాభికుచోరువక్త్రములు వే
డ్కన్ జూచితిన్ రోసితిన్

కంతు ప్రాజ్యవిలాస కేళి మది కె
క్కన్ గూడితిన్ బ్రేమమై
సంతాపం బొకయింత లేక కులటా
సంయోగినై యోగినై
రంతుల్ మానితి నిన్నుఁ జేరితిఁ గృపన్
రక్షింపు రామప్రభో. ౬౭

(శ్రీరామప్రభుశతకము)

క. అన్యునిగాఁ జూడకు నను
మాన్యునిఁ గావించి ప్రోవు • మా పరహితసౌ
జన్య మొనఁగూర్చి కరుణా
ధన్యా రఘుతిలకనిటల • తటనటదలకా. ౬౮

క. వినయవివేకము లెఱుఁగని
మనుజాధము నన్ను గరుణ • మన్నింపవె యో
దనుజాంతక యో దశరథ
తనయా రఘుతిలక నిటల • తటనటదలకా. ౬౯

క. నెఱబ్రత్యక్షం బైనను
వెఱువకుమని పలికి కరుణ • వెదజల్లి కరం
బిరిసిన దురితంబుల విడఁ
దఱుమఁగవలెను రఘుతిలక • తటనటదలకా. ౭౦

(రఘుతిలకశతకము)

మ. అజగౌరీశాదులు నిన్నుఁ గొల్చి రమరుల్
ప్రార్థింతు రేప్రొద్దు నె
ల్లజగంబుల్ సృజియించుకర్తృత్వ దయా
లంకారపిత్రుండ వా
త్మజుతుల్యంబుగ నన్నుఁ బ్రోవుము కృపన్
మద్దాలియుద్దండరా
య జయశ్రీసువిధేయ భక్తజనగే
యా నిత్యభాగ్యోదయా. ౭౧

మ. గజబంధిన్వ్యథమానమై యిహాసుసా
ఖ్యప్రాప్తి నొందింప నా
గె జుగుప్సం బడఁ జాల నింక భవదం
ఘ్రిద్వంద్వసేవానికా
మజగన్మోహనబుద్ధి నాకొసఁగవే
మద్దాలి యుద్దండరా
య జయశ్రీసువిధేయ భక్తజనగే
యా నిత్యభాగ్యోదయా. ౭౨

మ. విజితాయాసము గాఁగఁ బంచతయు ని
ర్వేదాప్తిగా జీవనం
బు జగద్వందిత యుష్మదంఘ్రిభజనా
పూర్ణంబుగా నిర్మలా

త్రిజటివార్తిసుతాత్మ నా కొసఁగవే
మద్దాలియుద్దండరా
య జయశ్రీసువిధేయ భక్తజనగే
యా నిత్యభాగ్యోదయా. ౨౩
(ఉద్దండరామశతకము)

మ. అల బృందావనవీథి ధేనువుల నె
య్యం బారఁ బాలించు వే
ళల నీ వందాక గోవు గన్పడిన వె
ళ్లం దోలితో సేను న
ట్టుల నజ్ఞానిని నన్నుఁ బ్రోవు మికఁ జో
ద్యో భక్తరక్షాసమా
కలితారంభక గొట్టుముక్కలపురా
కా రాజగోపాలకా. ౨౪

శా. సంప్రీతిన్ నిను సంస్మరించెదను మ
త్స్వాంతంబులో నిల్వవే
సుప్రజ్ఞానిధులైనభక్తుల మదిన్
సొం పొప్పఁగా నీవు ని
త్యప్రామాణ్యవిధిన్ వసింతువని యం
డ్రింగీకృతాచత్ప్రశం
గప్రాకారక గొట్టుముక్కలపురా
కా రాజగోపాలకా. ౨౫

శా. నీసౌందర్యగుణంబు లెంచు మదిలో
నిన్నే నుతింతున్ సదా
నీసంకీర్తన లాచరింతు నను నీ
నిత్యానుకంపాసుధా
కాసారంబునఁ దేల్చు మింక కమలా
గండస్థలీ పత్రరే
ఖాసంలేఖక గొట్టుముక్కలపురా
కా రాజగోపాలకా. ౭౬

(గొట్టుముక్క-రాజగోపాలశతకము)

ఉ. నీవె ధనంబు బంధుఁడవు
నీవె సఖుండవు నీవె తల్లియున్
నీవె గురుండు దాతయును
నీవె శరణ్యుఁడ వంచు నెమ్మదిన్
దేవర వారి పాదములు
దక్కని నమ్మితి నింక నైన నన్
గావుము దేవదేవ హరి
కంజవిలోచన రుక్మిణీపతీ. ౭౭

ఉ. దండము కృష్ణ నీకు యమ
దండన మింకిటఁ జేరనీకు నీ
దండమె రక్షసేకు హరి
దాసుని నన్ విడఁబోకుమో వత

త్కాండచయా పరాకు భవ
కాననసంస్థితి బల్ చికాకు వే
దండమురీతి నా కిఁక ము
దం బొనరింపుము రుక్మిణీపతీ. ౭౮

ఉ. ఏమని యేర్పరింతు మది
నేమని పాడుదు యుష్మదీయసూ
యామహిమంబుఁ గన్గొనఁగ
నంబుజజన్మశచీపతీశము
ఖ్యామరరాజికేనియు న
గమ్యము విస్తృతఘోరపాతక
స్తోమ మడంచి నన్నుఁ దయఁ
జూడుము కేశవ రుక్మిణీపతీ. ౭౯

(రుక్మిణీపతిశతకము.)

శా. ఓ కంజాతదళాక్ష చక్రధర స
ర్వోత్కృష్ట సర్వజ్ఞ శాం
తాకారా ఫణిరాజతల్ప పరమా
త్మా కోటికందర్పమా
శ్రీ కళ్యాణగుణాభిరామ శరణా
ర్థిన్ నన్ను రక్షింపరా
వే కంసాంతక నామచంబునకు గో
విందా రమాధీశ్వరా. ౮౦

శా. కేడీలాడు మదీయపాతకములన్
గెంటించి మత్కర్మముల్
పీడల్ పెట్టినఁ బెట్టనీక బలిమిన్
ఏప్పించి నీ వింక యే
జాడన్ బోవక నిల్వఁగా వలయు నా
సంకల్పసాధ్యాగ్రమో
వీడుంబంటు భవత్పదంబులకు గో
వింబా రమాధీశ్వరా. ౮౦

శా. కౌసల్యాత్మజ రామనామమున నే
తక్కల్ మీఱ వాల్మీకి హృ
త్కాసారంబున రాజహంసముగతిం
గన్పట్టి రక్షించు నీ
వ్యాసంగంబు దలంతునో యదుకులా
ధ్యక్షా దయం జూప రా
వే సర్వేశ్వర నామనంబునకు గో
వింబా రమానీశ్వరా. ౮౧

(రమాధీశ్వరశతకము.)

ఉ. శ్రీరమణీయ మీచరణ
సేవలయు మా కనయం బొసంగుమీ
తారక నామమంత్రమును
దాండవ మాడఁగ నాదుజిహ్వపై

ధారుణిఁ జేసి నాయఘము

తర్లఁగఁ జేయుము శేషశాయి మీ

చారికిఁ జేరినాఁడ సుమి

పాపహరా మహిజామనోహరా. ౮౩

ఉ. ఓరఘురామయంచుఁ బలు

కోరికఁ బిల్వఁగ నేల రావురా

నేరము చాలఁ గల్గినను

నీరజనాభ సహింపఁగాఁదగున్

గూరిమిచేత నీవు నను

ఘోరభవాంబుధిలోన వేసటుల్

దూరముఁ జేసి యేలు మిఁక

దోషహరా మహిజామనోహరా. ౮౪

ఉ. చూడఁగ నీపదద్వయము

సొంపు నుతింపఁగ నెంతవాఁడనే

వీడను నీదు భక్తియును

వేమఱుపాటున నైన నామదిన్

వేఁడెద రామరామ యని

వేడుకతోడ భజింపుచుందు నీ

వాడను నన్నుఁ బ్రోవు మిఁక

వాలిహరా మహిజామనోహరా. ౮౫

(మహిజామనోహరశతకము.)

చ. ఉరగశయాన దేవ పురు
షోత్తమ కేశవ రుక్మిణీమనో
హార నరమిత్ర మిత్రకమ
లాయతలోచన నిర్వికల్ప భా
సురనవహేమనేత్ర మధు
సూదన కైటభహారి దేవ నీ
శరణ మటంటిఁ గావు నను
సర్వజగన్నుతపార్థసారథీ. ౧౬

ఉ. పావనమైనమీచరణ
పద్మమరందముఁ గ్రోలుచున్న నా
భావము హీనదైవముల
పజ్జ వసింపఁగఁ బోవ నేర్చునే
తావకదాసదాసులకు
దాసుఁడ నయ్యెద నన్నుఁ బ్రోవవే
శ్రీవనితామనోహర వి
రించిభవార్చితపార్థసారథీ. ౧౭

చ. శమదమయుక్తి యోగు లని
శంబు యమాదులచేత నాత్మకా
యములఁ గృశింపఁజేసి హృద
యాంబుజపీఠములందు నీపదా

బ్జము లిడి నిత్యముక్తు లయి
సర్వము నీవని తల్తు రట్టి ని
న్నమలినభక్తి నేఁ గొలుతు
నచ్యుత కావుము పార్థసారథీ. ౮౮

(పార్థసారథిశతకము)

శా. నీకున్ మ్రొక్కెద నీదుసేవకులతో
నెయ్యంబుఁ గావించెదన్
నీకీర్తిన్ గొనియాడెదన్ మనసులో
నీధ్యానముం జేసెదన్
నీ కెవ్వారును సాటిలే రనుచు నే
నిత్యంబు వాక్రుచ్చెదన్
నాకున్ మోక్ష మొసంగఁగావలయు శ్రీ
నారాయణా మాధవా. ౮౯

శా. కామక్రోధములన్ జయించి మదిలో
గర్వంబు వర్జించి ని
న్నేమర్త్యుండు దలంచి కొల్చునో యతం
డే శుద్ధధన్యాత్ముఁడై
తా మోక్షంబును జెంద నర్హుఁ డని వేం
దంబందు నే నమ్ముచున్
నీమీఁదన్ మది నిల్పి కొల్చెదను తం
డ్రి ప్రోవుమీ మాధవా. ౯౦

శా. స్వర్లోకాంచితభోగముల్ మదిఁ దృణ
ప్రాయంబుగా నెన్నుచున్
నిర్లక్ష్యంబుగఁ జూచి నీదుపదసా
న్నిధ్యంబె నేఁ గోరి యం
తర్లక్ష్యంబుగఁ జేసికొంచు నెదలో
న న్నిల్పి ధ్యానింతుఁ ద
త్సల్లీలన్ననుఁ గాంచి ప్రోవుమయ యం
చున్ వేఁడెదన్ మాధవా. ౯౦

(మాధవశతకము)

చ. పరుఁడను గాను భక్తజన
పాలక పాలితగోపబాలకా
నరసఖ పద్మనాభ కరు
ణారసపూరితహృత్సరోజ నీ
కరుణదలిర్ప నన్ను సము
ఖంబుగఁ బ్రోచి వరం బొసంగు నీ
కరమర లేల నయ్య వర
దాయక శ్రీరమణీమనోహరా. ౯౧

ఉ. ఘోరపరేతరాజభట
కోటులశిక్షలు విన్న భీతిచే
సారసనేత్ర నీచరణ
సారసయుగ్మముచెంతఁ జేరితిన్

సారవిహీనసంసృతి వి
　　షాదతరంగములందు నన్ను నే
భారముఁ జెందనీకు కృప
　　భాసిల శ్రీరమణీమనోహరా. ౯౩

ఉ. పాపుఁడు వీనిఁ గాతునని
　　భావములోఁ దలపోసి నన్ను నే
పాపముఁ జెందకుండ దయఁ
　　బాలనఁ జేసి కృతార్థుఁ జేయుమీ
ప్రాపెదఁ గోరినాఁడ నిర
　　పాయదయానిధి నీకుమిక్కిలిన్
బ్రాపెవరయ్య ? తత్క్షణము
　　వాసిగ శ్రీరమణీమనోహరా. ౯౪
(శ్రీరమణీమనోహరశతకము)

ఉ. శ్రీతరుణీసమేత ముని
　　సేవిత భక్తజనాళిపోష పా
పాత్ముల పాపసంఘములఁ
　　బాఱఁగఁదోలెడివాఁడవంచుఁ బ్ర
ఖ్యాతిగ నమ్మితిన్ జగతి
　　కర్తవు మన్మథకోటి తేజ స
త్ప్రీతిగ మమ్ముఁ బ్రోవు భవ
　　భేదన యాదగిరీంద్ర మొక్కెదన్. ౯౫

ఉ. భావములోన నిన్నుఁ గడు
భక్తిఁ దలంచుచు నున్నవాఁడ నన్
గావవె సర్వలోకజన
కర్తవు భర్తవు దాత దైవమున్
నీవె యిహఃపరం బెఱుఁగ
నీరజలోచన పాపలోకసం
జీవము పాదసేవఁ దయ
చేయవె యాదగిరీంద్ర మ్రొక్కెదన్. ౯౩

ఉ. ఎంతని వేఁడుకొందు నిఁక
నేమని కోరుదు నిందిరేశ నీ
కెంతకు రాకయుండె దయ
హీనుఁడు వీఁడని యెంచినావ నీ
చెంతకు రాక యన్యులను
జేరను నీవిఁకఁ బ్రోవఁజూపుమా
సంతతభోగితల్పగుణ
సాగర యాదగిరీంద్ర మ్రొక్కెదన్ ౯౭

(యాదగిరీంద్రశతకము)

ఉ. బొందిని ప్రాణముల్ వెడలి
పోయెడినాఁటికి వాసుదేవ గో
విందముకుంద యంచు నిను
వింతగ నెంతునో యెంచలేను నే

నందుల కెంతొ చింతిలెద
నాసమయంబున కీవు వచ్చి నా
ముందఱ నిల్చియుండఁగదె
మ్రొక్కెద ధర్మపురీనృకేసరీ. ౯౮

ఉ. ఆయువు గల్గినంతపరి
యంతర మన్నివిధాల నాకు నో
పాయముఁ జేసి సేవకుని
ప్రాణము లేఁగెడివేళ శంఖచ
క్రాయుధముల్ ధరించి భుజ
గారివిహంగము నెక్కివచ్చి నీ
చాయకుఁ దీసికొమ్ము ననుఁ
జయ్యన ధర్మపురీనృకేసరీ. ౯౯

ఉ. ఓకరుణాసముద్ర పురు
షోత్తమ నీపదపంకజంబులున్
నాకు మహాధనంబు శర
ణాగతుఁడన్ ననుఁ జేతఁ బట్టు మీ
నేకపటాత్ముఁడన్ బరమ
నీచుఁడ నేరము లెంచఁ బోకుమీ
చేకొని తప్పులన్ని క్షమ
జేయుమి ధర్మపురీనృకేసరీ. ౧౦౦

(నృకేసరిశతకము)

మ. జననీగర్భములోన నుండఁగ విదే
శం బేగి పెక్కేండ్లకున్
జనుదేఁ దండ్రినిఁ గాంచుబిడ్డవలె నీ
సంబంధమున్ మున్ను నేఁ
గన కీవేళ నెఱింగి స్వేచ్ఛాభయశం
కాముత్త్రపాశ్చర్యభా
జన మై వచ్చితిఁ జేరఁదీసికొనవే
సద్భక్తచింతామణీ. ౧౦౧

మ. కరణప్రజ్ఞలు దూలకుండఁగ నోడల్
గాసిల్లకుండంగ సత్
మరణావేదన నొందకుండఁగను యు
ష్మద్దివ్యపాదాంబుజ
స్మరణం బేమఱకుండ నైహికదురి
చ్ఛల్ రెచ్చకుండన్ ముదక్
వర కైవల్యమనుగ్రహింపఁగదె దే
వా భక్తచింతామణీ. ౧౦౨

(భక్తచింతామణిశతకము)

ఉ. భూమి ననేకజన్మములఁ
బూనితి నోర్వను జన్మ మెత్తనే
నామకథాసుధారసము
నాలుకఁ గ్రోలితి సేవఁ జేసితిన్

వేమఱు వేఁడుకొంటి నను
వేదనఁ బెట్టకుమంటి సిఁరుచే
ప్రేమను నిత్యమైనపద
విన్ గృపతో వసుదేవనందనా. ౧౦౩

ఉ. శ్రీరమణీయమైనకృప
చేతను బ్రోవుము నాదుమిత్రులన్
వారిని వారివారిమఱి
వారినిఁ జేరిన వారి నెప్పుడున్
భూరివివేకసంపదను
పుణ్యసముత్కులఁ జేసి యేలుమా
భూరిగుణాఢ్య వేఁడెదను
పూజ్యపదా వసుదేవనందనా. ౧౦౪

ఉ. శ్రీపతి నీకు వందనము
శ్రీలలనామణియైనలక్ష్మికిన్
గోపసతీలలామలకు
గొబ్బున మ్రొక్కులు జానజానుఁడన్
నాపతి వంచు నమ్మితిని
నామదివాంఛలు దీర్చి కావుమా
పాపి నటంచు నెంచకుము
పారకృపావసుదేవనందనా. ౧౦౫

(వసుదేవనందనశతకము)

సీ. గజరాజు నేలిన ♦ కరుణ ద్రుపదకన్య
కను మనిచినయది ♦ కంప హారిణి
కాంతను బ్రోచిన ♦ కారుణ్యము విభీష
ణుని బ్రదికించిన ♦ నెనరు గనక
కశిపుసూనునిఁ ♦ గాచినఘృణ గాక
దనుజుఁ బాలించిన ♦ దయ కుచేలు
సాకినకృప దాప ♦ సత్ప్రవరుల రక్ష
వెలయుననుక్రోశ ♦ ము లవమైన

గీ. పాదసేవకు నామీఁదఁ ♦ బరగఁ జేయ
లేదయా సుప్రసాదవి ♦ నోదలలిత
గురుకటాక్షదృగస్తోక ♦ కొలనుపాక
వీరనారాయణముకుంద ♦ విశ్వతుంద. ౧౦౬

సీ. జారుఁడ చోరుఁడ ♦ జడుఁడ నాచారహీ
నుఁడఁ జాల దురభిమా ♦ నుఁడ ఖలుఁడ వి
వేకవిదూరుఁడ ♦ వివిధపాపాచర
ణవిశారదుఁడ దుష్టుఁ ♦ డ విగతకుశ
లుఁడ భవనీరధి ♦ లోపల మునిఁగి తీ
రమునకుఁ జేరనే ♦ రక తిరుగుడు
బడలినవాఁడ నె ♦ ల్బంగిఁ జేపట్టి ర
క్షించెదో వేగ ర ♦ క్షింపవే వ

గీ. రాదు గాక పతులచేతి ♦ కీక బకని
శాటజీవజగత్ప్రాణ ♦ జాతహరణ
కుశలభుజదండశూక శ్రీ♦కొలనుపాక
వీరనారాయణముకుంద ♦ విశ్వతుంద. ౧౦౭

(వీరనారాయణశతకము)

సీ. రామదాసాదుల ♦ రక్షించినట్టుల
నెలమితోఁ గుచేలు ♦ నేలినట్లు
ప్రహ్లాద నారద ♦ ప్రభృతిఁ బ్రోచినయట్లు
సరవితో ముచికుందుఁ ♦ సాకినట్లు
అల ద్రౌపదికి వల్వ♦లాదుకొన్నట్టుల
గజరాజు నవనిలోఁ ♦ గాచినట్లు
శబరివిందుకు సంత♦సంబుఁ జెందినయట్లు
మహిని ఘంటాకర్ణు ♦ మనిచినట్లు

గీ. నన్ను దయ నేలు నేరము♦లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేక♦ములు హరించి
భద్రగిరివాస శ్రీరామ♦భద్ర దాస
పోష బిరుదాంక రఘుకులాం♦బుధిశశాంక. ౧౦౮

(భద్రగిరిశతకము)



